సనీ గ్రంథమాల, ద్వితీయపుష్పము.

# విజయప్రతిజ్ఞ.



[ఐదంకముల నాటకము.]



గ్రంథకర్త:

తంగిరాల జగన్నాథశాస్త్రి.

# గమనింపు.



☞ బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వరుల పుస్తకముఁ
కావలయువారు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు శతావధా
కడియం, అనికాని, దివాకర్ల వేంకటావధాని, కాకినా
దిగుమర్తివారివీధి, యనికాని, కాత్యాయనీ గ్రంథమా
తణుకు, అనికాని వ్రాసినఁ బడయఁగలరు.

కాత్యాయనీ గ్రంథమాల,
ద్వితీయపుష్పము.

తంగిరాల జగన్నాథశాస్త్రి,
దివాకర్ల వేంకటావధాని,
సంపాదకులు

శ్రీమత్పరదేవతాయైనమః



# విజయప్రతిజ్ఞ

ఇది
తంగిరాల జగన్నాథశాస్త్రిచే
రచియింపఁబడినది.

మొదటికూర్పు 1,000 కాపీలు.

కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1928



చందాదారులకు రు 0-10-0. ఇతరులకు రు. 0-12-0.

# ఉపోద్ఘాతము.



పాఠకమహాశయులారా!

ఈనాటకమున భారతమందలిగాథ ద్రోణపర్వములో నభిమన్యుని పద్మవ్యూహప్రవేశము మొదలు సైంధవసంహారమువఱకును బ్రస్తావింపఁబడినది. ఇందలికథ భారతమును బట్టియుఁ, గొంత బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతివేంకటేశ్వరులుచే రచింపఁబడిన "పాండవ విజయము" నుబట్టియుఁ, గొంత కల్పితముగను రచింపఁబడినది. ఈకల్పితమైనను నాటకానుగుణ్యమునకే గాని భారతవ్యతిరేకము కాదు. సుప్రసిద్ధకవులును, శతావధానులు నగు బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వరులు మొదలగువారిచే రచియింపఁబడిన భారతనాటకము లనేకము లుండినను నాకు భారతముపైఁ గలయభిమానమునకుఁ దోడస్మన్మిత్రుల ప్రోత్సాహ మీనాటకరచనకున న్నుఁ బ్రేరేచుటచే, నీసాహసమునకుఁ బూని 1921 సం॥రమున మద్గురుపుత్త్రు లగు చిరంజీవి దివాకర్ల వేంకటావధాని సలహా ననుసరించి రచించితిని, కాని "శ్రేయాంసిబహువిఘ్నాని" యను నార్యవచనము ననుసరించి కారణాంతరములచే నింతవఱకును ముద్రించుభాగ్య మలవడినది కాదు. నే నీగ్రంథమూలను స్థాపించుటకు ముందు నాపితృవ్యపుత్త్రు లగు బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటసూర్యనారాయణ బి. ఏ, బి. ఇ.

గారు దీని ముద్రణమువిషయమై యత్నించిరి. కాని, ముందు గా నేదేని భగవత్పరమగు గ్రంథము నొకదానిని ముద్రింపించినతరువాత నిది ముద్రింపింప నెంచి "కాత్యాయనీస్తోత్ర" మనుపేరుతోఁ గొన్నిపద్యములను ముద్రింపించితిని. అంత నొకగ్రంథమాలను స్థాపింప నుత్సహించి, "కాత్యాయనీ గ్రంథమాల" స్థాపించి బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే రచియింపఁబడిన "దేవీభాగవతము సప్తమస్కంధము" ప్రథమ పుష్పముగాను, ఇప్పు డీపొత్తమును ద్వితీయపుష్పముగాను ముద్రింపించితిని. నారచన కిదియే ప్రథమప్రయత్న మగుట చే నిం దనేకలోపము లుండవచ్చును.

"మ. చదువం లే దొకశాస్త్రమేని గురులన్సద్భక్తి నర్చించి నీ
పదయుగ్మంబు భజింప లేదు జననీ! బాల్యంబునందుండి దు
ర్మదులం గూడి జరింతు నిందనుక నేమం బేమియుం లేక నీ
సదయాంతఃకరణమ్మునందనుపుమో సావిత్రి! కాత్యాయనీ!"

అని మున్నే లిఖించియుంటిని. ఇట్టి నా యీరచనయం దలి దోషములను బండితలోకము మన్నించి, తెలియఁబఱిచి నచో ముందుముద్రణమున సవరించుకొందు నని ప్రార్థించు చున్నాను.

ఇట్లు విధేయుఁడు,
తంగిరాల జగన్నాథశాస్త్రి.

# ప్రోత్సాహకులు.

1 బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటసూర్యనారాయణగారు.
బి. ఎ. బి. యి. లోకల్ ఫండు అసిస్టెంటు
ఇంజనీయరు, నర్సాపురం.

2 ,, తంగిరాల వేంకటసుబ్బయ్యగారు.
పోలీసు సబ్ యినస్పెక్టరు జయపురం

3 ,, గుళ్ళపల్లి సోమయాజులుగారు
గరల్సు స్కూల్ హెడ్ మాష్టరు భద్రాచలం

4 ,, చిలుకూరి నరశింహారావుగారు
బి. ఎ. బి. యి. డి. కాకినాడ.

5 ,, నోరి సత్యనారాయణగారు కాకినాడ.

మహారాజపోషకులు.

6 మ॥ రా॥ శ్రీ॥ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు
పంతులుగారు. ఆంధ్రపత్రికాధిపతి చెన్నపురి.

రాజపోషకులు.

7 బ్రహ్మశ్రీ దేవరకొండ రామనాథంగారు మండపాక.

8 ,, యర్రమిల్లి నారాయణమూర్తిగారు
బి. ఎ. బి. యల్. వకీలు నర్సాపురం

9 మ॥ రా॥ శ్రీ॥ బి. యస్. నారాయణగారు. కాకినాడ.

10 ,, పి. వెంకటాద్రియ్యన్నగారు కాకినాడ.

11 ,, జి. శ్రీనివాసరావుగారు తహశ్శిల్‌దారు
చోడవరం

12 ,, పి. హనుమంతరావుగారు సబ్ ఓవరుశీయరు
పి. డబ్లియు. డి. ఉండి

13 ,, పి. వెంకటస్వామినాయుడు గారు కంట్రాక్టరు
పాలకొల్లు.

పోషకులు.

14 బ్రహ్మశ్రీ సి. వై. సోమయాజులుగారు.
బి. ఎ. బి. యల్. వకీలు నర్సాపురం

15 ,, మురుకుట్ల సుబ్బారాయుడు గారు.
బి. ఎ. ప్లీడరు భీమవరం.

16 ,, మేడూరి లక్ష్మీపతిగారు. మండపాక

17 ,, మేడూరి సూర్యవర్ధనంగారు మండపాక.

18 మ॥రా॥శ్రీ॥ తాడిమేటి వీర్రాజుగారు మండపాక

అభిమానులు.

19 బ్రహ్మశ్రీ దేవరకొండ పాపయ్యశాస్త్రిర్లుగారు మండపాక

20 ,, జోశ్యుల రామచంద్రరావుగారు.

21 ,, జయంతి దీక్షితులుగారు. కాకినాడ.

22 ,, మురవర లక్ష్మీనర్సప్పగారు. డిప్యూటీ కలక్టరు
భద్రాచలం

23 శ్రీమాన్ సాతులూరి నరశింహాచార్యులుగారు మండపాక

24 మ॥రా॥శ్రీ॥ గుత్తా వెంకయ్యచౌదరిగారు ఏలూరు

# ఇందలి పాత్రములు.

## ప్రథమాంకము.

నటి, సూత్రధారుఁడు
సైంధవుఁడు
సూతుఁడు
భీముఁడు
సాత్యకి
నకులుఁడు
సహాదేవుఁడు
యుయుత్సుఁడు

## ద్వితీయాంకము.

ధర్మరాజు
యుయుత్సుఁడు
ద్రౌపది
శ్రీకృష్ణుఁడు
అర్జునుఁడు
సైంధవుఁడు
సుయోధనుఁడు
కర్ణుఁడు
కృపుఁడు
అశ్వత్థామ
శకుని
సేవకుఁడు

## తృతీయాంకము

ధర్మరాజు
భీముఁడు
సేవకుఁడు
శ్రీకృష్ణుఁడు
సాత్యకి
అర్జునుఁడు
ద్రోణుఁడు
సుయోధనుఁడు

## చతుర్థాంకము

శ్రీకృష్ణుఁడు
అర్జునుఁడు
సుయోధనుఁడు
చిత్రవర్ణుఁడు
విచిత్రరథుఁడు

## పంచమాంకము.

శ్రీకృష్ణుఁడు
అర్జునుఁడు
సాత్యకి
కర్ణుఁడు
అశ్వత్థామ



శ్రీమత్పరదేవతాయైనమః.

# విజయప్రతిజ్ఞ.

## ప్రథమాంకము.

### నాంది.

చ. ఎవనికృపావశమ్మున, నుమేశునగంబునఁ గేగఁజాలి, యా
భవునియనుగ్రహమ్ముఁ గని, పాశుపతమ్ము గ్రహించి, సిం
ధుభూ, ధవుఁ దెగటార్చఁజాలెనో పృథాతనయుం డలశౌరి
రుక్మిణీ, ధవుఁ డనురాగ మూనుచు సతంబును మీకు నొ
సంగు సంపదల్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును]

సూత్ర—ఇప్పటికిగదా నాపూర్వపుణ్యము ఫలించినది. సక
లకలావిదులును సారజ్ఞులు నగు నీసభ్యులయెదుటఁ జిరప
రిచితమగు మన్నాట్యవిద్యఁ బ్రదర్శింప నదను కలిగినది.
(తెరవంకఁ దిరిగి) ప్రేయసీ! ఇటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! ఇదె వచ్చితి. ఏమి యాజ్ఞ?

సూత్ర—ప్రేయసీ! ఈసభాసదులు "భారతకథకు సంబం
ధించిననూతననాటక మెద్దియేని ప్రదర్శింపుఁ" డని యా

నతిచ్చిరి. వారియాజ్ఞ కనుగుణ మగునాటక మెద్దియో
నాకు స్ఫురింపక నిన్నుఁ బిలువనంపితిని.

నటి—ఆర్యపుత్రా! దాని కింతసందియ మేల? మీరొనరిం
చిన నాందినిబట్టియే గ్రహింపనగును.

సూత్ర—(యోజించి) విజయప్రతిజ్ఞయా?

నటి—ఔనౌను.

సూత్ర—విజయప్రతిజ్ఞను నూతనముగా రచించినవా రెవ్వరు?

నటి—ఆర్యా! శ్రీతిరుపతి వేంకటేశ్వరుల నెఱుఁగుదురా?

సూత్ర—ఆఁ; ఎఱుఁగ కేమి?

చ. సరసకవిత్వకీర్తిఁ దుర్గిలు, యశస్కరదివ్యవధానతంత్రభా
స్వరులు, మదాత్తదుష్కవిగజవ్రజసింహము, లాంధ్రరా
ష్ట్రభూ, వరవరమౌళిరత్నచయబంధురహృద్గమకాంతిపుం
జభా, సురపదు, లార్యసమ్మతులు, సూరివరేణ్యులు నే
నెఱుంగనే?

వారేనా కృతికర్తలు?

నటి—కృతికర్త వారిశిష్యవరమూగువు.

సూత్ర—(మరల యోజించి) అవునవును. జ్ఞప్తికివచ్చినది.

సీ. శ్రీ. తంగిరాలజగన్నాథుతనయుఁ డగుచుఁ
దనరు సుబ్బావధానికృతసుకృతవర
ఫలము, లక్ష్మమాంబాగర్భవార్ధిచంద్రుఁ
డైవయట్లజగన్నాథుఁ డనఁదగుకవి.

నటి— అట్లయిన నాటకానుగుణ్యం బగుశరదృతువుం గూర్చి కొంచెము కీర్తించెదను.

ఉ. మ్రోసె జయధ్వనుల్, భటసమూహము లెల్లెడ నిండియుం డె బ్బాణాసిగదాప్రహారముల నాజిని సద్భటులెల్ల జీవము ల్బాసి తొలంగుచుండిరి దివంబున కత్యనురక్తి నీశ్వరా శాసితసైంధవారవము సాఁగెడు మిత్తి నెఱుంగ కక్కటా!

[తెరలో]

అరరే! ఎవ్వ రాయశ్లీలమ్ము లాడువారు? ఈశ్వరునిచే శాసింపఁబడిన సైంధవునకు మృత్యువు ప్రాప్తించు టన నెట్టిది?

సూత్రి—(చెవియొగ్గి విని) ప్రేయసీ! పశుపతిచే వరమ్ము గ్రహించి తద్బలమాత్రగర్వితుఁడై, పాండవులఁ నరికట్టం జనుదెంచుసింధుభూపతి, నీవచనమ్ములకుఁ గినిసి యిటకుం జనుదెంచుచున్న ట్లున్నవాఁడు. మన మాతనియగ్రమ్మున నిలుచుట తగదు. రమ్ము పోవుదము. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

[పిదప సారథీద్వితీయుఁడై సైంధవుఁడు ప్రవేశించును]

సైంధ—అరరే! ఎవ్వ రాయశ్లీలమ్ము లాడువారు? ఈశ్వరునిచే శాసింపఁబడిన సైంధవునకు మృత్యువు ప్రాప్తించు టన నెట్టిది? (దిక్కులుపరికించి యెవ్వరింగానక) దురాత్ము లు నోటికివచ్చినట్లు వదరుటయే కాని వాయగ్రమ్మున

నిలువఁగలరా ? పోనిమ్ము! వారలజోలి నాకేల ? ఈశ్వ
రవరప్రసాది నగునాకు భీతితో నేమి ? (సంతోషముతో
నెదుటఁ జూచి) నేఁడు పాండవమధ్యముఁడు రణంబున లేఁ
డుగదా ? ప్రళయకాలసంజనితపయోనిధివీచీధరాధరసం
ఘట్టనసమయసముద్భూత మ్మగుకోలాహలమ్ము నతిక్ర
మించుచు రణసంరంభమ్ము మిన్నుముట్టుచున్న దేల? (స్మృ
తినభినయించి)అయ్యది పద్మవ్యూహముం జొచ్చుటకై యరు
దెంచినయభిమన్యుని రథనేమిధ్వానమ్ము కాఁబోలును;
మేఘగంభీరస్వనమ్ము నతిక్రమించుచు రోదసీకుహరమ్మె
ల్ల నిండుచున్నది. నేనును పాండవసైన్యమ్ముఁ జీకాకుప
ఱచి భీమసేనాదుల నరికట్టి మాసుయోధనునకు మేలొ
నఁగూర్చెదను. (చెవియొగ్గి విని) ఏమి ? సింధురాజున కె
న్నఁడును లేనిపరాక్రమ మనుచున్నారా? (కోపముతో)
ఔరా ! దురాత్ములు సైంధవుఁడు శంభువరప్రసాది యని
యెఱుంగరు కాఁబోలును!

సూతు—దేవా ! మహేశ్వరుఁడు మీకు వర మ్మొసంగిన
సందర్భము నా కెఱిఁగింపఁ బ్రార్థించుచున్నాను. దానిన
ఱింగి యుక్తాయుక్తమ్ము లెఱింగి రథికుఁ డెట్లువర్తింపవల
యునో యుపదేశించుట సారథికర్తవ్యము గాన నాకోరిక
ను మన్నింపుఁడు.

సైంధ—సూతుఁడా ! నాఁ డరణ్యమ్మున కేగి పాండవులచే

నవమానితుండ నగుట యందఱెఱింగినదే కదా? అప్పటి నుండియుఁ బాండవులపైఁ బగఁ దీర్చుకొనఁ గృతనిశ్చయుఁడనై పశుపతింగూర్చి తపం బొనర్ప—

సీ. పులికశేరుక నొందు మొలఁ దాల్చి మెయినిండ
భస్మరేఖల కాంతి ప్రబలుచుండ
జడలు గట్టిన శిరోజముల పెన్మడినుండి
యమృతకిరణుఁడు నాట్యమ్ము సల్ప
ఘనజటామకుటస్థగంగాప్రవాహమ్ము
నలుతఁ దాల్చినపాము లానుచుండ
జగముల హరియింపఁ జాలు హస్తమ్ముల
శూలపినాకముల్ శోభిలంగ

తే. గీ. మూసినతృతీయలోచనము వహించి
శంభుదేవుండు మోప్రిల సాక్షాత్కరించి
వరముఁ గోరుమటన్న నాపాండుసుతుల
సైన్యయుతము జయించినఁ జాలు నంటి.

చ. కరమరుదయ్యె నీతపముఁ గాంచిన సంతసము న్వహించితి
న్నరు నదిరింపఁగాఁ దగిననాయకుఁ డీజగమందు లేఁడు; త
త్కారులఁ బృథాకుమారకుల నొక్కదినమ్మున నిల్వరింతువీ
వరుఁడుగ నంచు నానతిడి యద్రిసుతాధిపుఁడేగెఁ జెచ్చెరన్.

కావున,

ఉ. యుద్ధమునందుఁ గుఱ్ఱనికి నూఁత యొసంగఁగ నేఁగుదెంచు గ
ర్వోద్ధతు లైనపాండవుల నుక్కడఁగించెద నేఁడు, క్రీడి, యా
యుద్ధవమిత్రుఁ గూడియుఁ గనొక్కఁడ యుద్ధముసేయుచుండె స
న్నద్ధముసేయుమా రథము నాకు హితమ్మును గోరి సూ
తుఁడా !

సూతు—దేవా ! అనుకూలకాలము చేకుఱిన దని దేవరవా
రిట్లు తొందరఁ జెందు టుచితమ్ము కాదు. కృష్ణార్జునులు
రణరంగమ్మున లేరని సాహసించుచుంటి రభిమన్యుఁడు
మాత్రము సామాన్యుఁడా ?

ఉ పాండవసింహమ్ము తనయు పార్థునిపట్టి, మురారియల్లుఁ డా
ఖండలపౌత్రికుండు రిపుఖండనకృత్యయశోవిశాలుఁ డా
భండనపండితుం డతనిఁ బార్థివ గెల్వఁగ నేర వయ్యయో
యుండఁగఁ జూచుకొమ్మసుర లూరక పర్వులనెత్తలాథమే.

సైంధ—పరిపంథులు పద్మవ్యూహమ్ముఁ జొఱకుండ నరికట్టఁ
బోవు నాకీవిపరీతార్థకములగు నుపదేశము లొనర్చుచుం
టి వేల? నే నాభీమసేనాదియోధుల నరికట్టినయెడల
నభిమన్యుఁడు వ్యూహమ్మునఁ జిక్కువడును.

తే. గీ. తన్నుఁ గాపాడఁ గాఁ దగు తగినయోధు
లెవ్వరును లేక యభిమన్యుఁ డీల్గు నచటఁ;
గులము నిలుపంగఁ దగుసుతుఁ గోలుపోయి
ప్రాణములు వీడకుందు రే పాండుసుతులు.

సూతు — దేవా ! అట్లుగా దట్లుకాదు.

తే. గీ. కొమరు నొంటిగఁ జంపిన క్రోపభరము
వలనఁ బార్థుఁడు రణమునఁ జెలఁగి యేమి
సేయునో ? సుంత యోజింపు సింధురాజ !
తొందరను బొందు టొప్పునే దురమునందు?

సైంధ — (కోపముతో) నీ వనవసర మ్మగుప్రసంగములజోలి కిం బోక విహితకృత్యమ్ము నెఱవేర్చుకొనుము. సత్వరమ్ము రథం బాయత్తపఱుపుము.

సూతు — (తనలో) ఇప్పు డీమహారా జొక్కమహేశ్వరు పరమ్ముఁ దక్క తక్కిన దేదియు నాలోచింపక మాట్లాడు చున్నాఁడు. కాని నే నేదివచించినను వీనిమది కెక్కునట్లు లేదు. (ప్రకాశముగా) దేవా! రథికహితోపదేశము సారథికిం గర్తవ్యమ్ము గాన నట్లు నుడివితి. ఇదె చని రథమ్మును సత్వరమ్ము గొనివచ్చెద. (నిష్క్రమించును.)

[తెరలో]

మ. పవమానాత్మజుఁడు న్నవల్ రణమున న్బార్థాత్మజుం బ్రోవ, భూ, ధవులం బెక్కురఁ గూలనేసి యిటు పద్మవ్యూహ ముం జేరి రా, హావరంగమ్మున నిల్వఁజాల రెటులే నా పత్తులం బాయ సైం, ధవసాహాయ్యము నాత్మఁ గోరె ధరణీంద్రవ్రాత ముత్కంఠమై.

సైంధ—(ఆకర్ణించి) ఆహా! ఏమిది? ద్రోణకర్ణాదియోధ వరులు వ్యూహమున నుండిరి కదా యని నే నుపేక్ష సేయుచుంటిని. (ఒకవైపుదిరిగి) అదుగో! అచ్చటనే సూతుం డరదమ్మున కశ్వమ్ములం బూన్చుచున్నాఁడు. అచ్చటకే పోయి సత్వరమ్ముగ సమరమ్మున కేగెద.

(నిష్క్రమించును.)

---

యు ద్ధ భూ మి.

[సాత్యకి, భీముఁడు ప్రవేశింతురు.]

భీము—బావా! సాత్యకి! వింటివా సైన్య మెట్లు గగ్గోలు గావించుచున్నదో? (ఎదుటఁ జూచి) ఏమది దుర్యోధనుం డంత తొట్రుపడుచున్నాఁడు?

సాత్య—సమీరకుమారా! ఏ మట్లాశ్చర్య మందుచుంటివి? ఇంతకుముం దాసైన్యము గావించిన యాక్రందన మీవు వినలేదా?

మ. పవమానాత్మజుఁడన్......(అనుపద్యముం జదువును.)

భీము—అవునవును. కుమారపరాక్రమఝంఝూమారుతమ్మునెదుట నీకురుసైన్యమ్ము గడ్డిపఱకయుం గాదు.

సాత్య—మహారథశ్రేష్ఠులారా! త్వరగా నడువుఁడు.

చ. కెలఁకుల యోధులన్ గెడపి, క్రీడవిధమ్మున ముగ్గరమ్ములో, పలకుఁ జనెన్ గుమారుఁ డలవానికి సాయముఁ బోవ

నొప్పు, భూతలపతి యర్జునాత్మజుని దాఁకి రణం బొనరిం
పఁబోలు మీ, రలు వెనువెంట నేగిన ధరావరుఁ డీగ్గఁ
డె యొక్కపెట్టునన్.

ఆలస్య మొనరింపక కుమారుఁ డొనర్చినదాగివెంబడి మొగ్గ
రమ్ములోనికిం బోవుదము రండు. (పరిక్రమింతురు.)

[నకులసహదేవులు ప్రవేశింతురు.]

నకు—సహదేవా!

ఉ. పంతముఁబట్టి పార్థు నెడఁబాపి, రణమ్మున ధర్మరాజు వి
క్రాంతి యడంచి పట్టి తనరాజున కర్పణఁ జేయ ద్రోణుఁడే, పంతముఁ బట్టి వ్యూహమును బన్నెను, వాసవ
పౌత్రుఁ డేచి స, ర్వాంతము సేయఁగాఁదొడఁగె నర్జున
పుత్త్రు నెదుర్ప నేరి కా.

మనముకూడ పద్మవ్యూహమునఁ గుమారునిం గలియఁబోవు
భీమసేనాదులఁ జేరఁబోవుదము. రమ్మ.

సహ—(కేటిపాటుఁజూచి) అన్నా! సంగర మెంతఘోరము
గా నున్నదో చూచితివా?

ఉ. తేరు లనేకముల్ విఱిగెఁ దేజముఁ బాసె హయమ్ము
లేన్గు లా, హారవముల్ సెలంగె, నదయమ్మును నెత్తురు
పెద్దకాల్వలై, పాఱఁదొడఁగె, సారథులు ప్రాణము వా
సిరి, కేతనమ్ములున్, ధారుణిఁ గూలె, భూవిభుఁడు దర్ప
ము వీడను సేన భీతిలెన్.

అన్నా! పావనియుఁ, గృష్ణానుజుండును, తక్కుంగల దృష్టద్యు మ్నాదియోధులును మొగ్గరమ్ముఁ జొఱఁబోవుచున్నా రు. వారలను గలియుదము రమ్ము. (పరిక్రమింతురు.)

భీము—(వెనుకకుఁ దిరిగి, ఆశ్చర్యముతో) తమ్ములారా! ఇ ట్లొనర్చితి రేమి?

ఉ. అన్నను బట్టియీయ గురుఁ డాకురురాజునకు న్బాస నిచ్చి తాఁ, బన్నెను మొగ్గరమ్ము వెసఁ బార్థుపఁ బాపిరి వేఱు చోటికి, న్నన్నా! యిదేమిచోద్యము? యమాత్మజు నొం టరిఁ జేయఁ జెల్లునే, ద్రన్నన నేగి యత్యున్నఘుఁ గావఁగ నుండుఁడు మీరు సన్నిధన్.

సహ—అన్నా! ధర్మజానుమతిం జనుదెంచినవారము కాని నీయాజ్ఞ నుల్లంఘించి మహారాజు నొంటిగ విడచినవార ము కాము.

భీము—కుఱ్ఱవాఁ డొంటిగ నేగుచుండెను గదా యని చిం తించి మనసు మనసున లేక పొమ్మన్నంతమాత్రమున మ హారాజును వీడఁజెల్లునా? సాత్యకిదృష్టద్యుమ్నాదియో ధులతోఁగూడ నున్న సౌభద్రున కేమియు భయము లేదని విన్నవించి యక్కడనే యుండుఁడు. పొండు.

నకు—అన్నా! నీయాజ్ఞానుసార మాధర్మనందనునికడ నుండ నమ్మహాత్ముఁడు పాంచాలీసదనమ్మునకుఁ దన్నుం దో

డోఁనిపొమ్మని యానతిచ్చె; మే మట్లాచరించితిమి. మం
దిరమ్ము బ్రవేశించినతోడనే మహారాజు మాకిట్లానతిచ్చె.

భీము — తమ్ముఁడా! ఎట్లు ?

నకు — మ. కదనంబున శత్రుసేన లవ్యవంగాఁ జేయుపా
ర్థాత్మజున్, ముద మొప్పంగని, వారితో సరిగ నాయూ
ర్ఖావనిపాలను, ర్మదముం ద్రోచి మదీయతాపము వసిన్
మాన్పంగఁ బూనుంను, యీ, సదనంబును వసించు నా
విషయమై సందేహ మేలా మదిన్?

అని యాజ్ఞాపింపఁ దదీయపదమ్ముల కెఱఁగి వారియాశీర్వా
దమ్ము గ్రహించి వచ్చితిమి.

భీము — తమ్ములారా! అన్నగారు పాంచాలీవాసముఁ జేరి
రని చెప్పినంతనే మదీయం బగు కొందలమ్ము డిందుపడి
నది.

సాత్య — పాండునందనులారా! కుమారుండు మొగ్గరమ్ములోఁ
బ్రవేశించినాఁడు. కౌరవు లావ్యూహముఖద్వారమ్మున
కరుదెంచిరేని, మఱల నేరీతి భేదింపవలయునో మన మె
ఱుంగము. అట్టియెడఁ జిక్కులు సంభవించును. కాన త్వే
మసమాచారమ్ములతోఁ గాలము వృథసేయక కర్తవ్య
మునకుం గడంగుఁడు.

భీము — సాత్యకీ! కాలహరణ మొనర్చిన మోహరము జేర
నశక్య మనియా? అట్లఁ జూతము. (ఎదుట:జూచి)

కౌరవయోధు లెవరిప్రాణంబులు వారు గాచుకొన నడ్డ
సలకుం బూనుచున్నారు. అదియునుంగాక,

శా. శైనేయుండవు నీవు, మాద్రిసుతదృష్టద్యుమ్నులున్ ద్రౌ
పదీ, సూనుల్ నేను శిఖండి యుండ, విశిఖస్తోమమ్ము లొ
క్కుమ్మడిన్, మేనన్ గ్రుచ్చి సుయోధనాదుల బలోన్మే
షమ్ము వారించి, యీ, సేనన్ ద్రోచి రయమ్ము మొగ్గ
రమున్ జేరంగ జంకేటికిన్?

కావున మన కా మొగ్గరముఁ బ్రవేశింపరా దనుజంకు వీడుము.

(పరిక్రమింతురు)

సైంధ—(ప్రవేశించి) ఓరోరి వాచాటులారా!

మ. అలుక న్నాఁడు వనమ్మునందు, నను మీ రన్నట్టిదుర్వా
క్యముల్, సలుపన్ రానియగౌరవమ్ములును యస్త్రజ్వా
లలఁ బోలి, ని, శ్చలతన్ మిమ్ములఁ జంపు టెన్నఁ డను కాం
క్ష న్నే విలోకింపఁగాఁ, గలిగెన్ మీకును నాకు నేఁ డిచ
ట సంగ్రామమ్ము దైవాజ్ఞ చే.

వాఁటిచర్యలను జ్ఞప్తికిఁ దెచ్చుకొని నాతో రణమ్మునకుం
గడంగుఁడు.

సహ—ఓరీ! పాండవదాసా! గృహస్థాశ్రమమునం దుండియు
బ్రహ్మచర్యాశ్రమమునందలి కోర్కె తీరక, నీ కట్టియభి
ప్రాయమ్ముఁ దీర్చువా రెవ్వరును లేక, బావలమైన మ
మ్మడిగినచో హేళన మొనరించెద మనుశంక మనమ్మునఁ

బీక్షింప దుర్మార్గతకుం జొచ్చిన నిన్ను, వధించుటకుమారు, ధర్మజాజ్ఞచే నీయభిప్రాయ మిట్టి దని గ్రహించి వడుగు పెండ్లికొడుకు నొనర్చి, సర్వసాధారణముగు బ్రహ్మచారు లట్లుగాక, గృహస్థాశ్రమము నుండి, బ్రహ్మచర్యాశ్రమము స్వీకరించినమహానుభావుండవు గనుక దేశదేశమ్ముల “భవతి భిక్షాం దేహి” యనుటకు మారు “పాండవదాసుఁడ” నని చెప్పికొని జీవింపు మని పంపితిమి. నాఁడు మే మొనర్చినయుపకార మపకారముగాఁ దలంచి, మా బలపరాక్రమాదు లెఱింగినవాఁడ వయ్యు, మహాపౌరుషవంతునింబలెఁ బ్రగల్భములఁ బలుకం జొచ్చితివి. నేఁడు నిన్ను వధించి క్రమప్రకారము నీగృహస్థాశ్రమము నీ కిప్పింప నెంచి, రంభాసంభోగమునిమిత్త ముత్తరలోకమున కనుపనుంటిమి. కావునఁ గాలహరణం బొనర్పక రమ్ము.

సైంధ— ఓరీ! కనిష్ఠపాండవా! నాఁడు నన్నొంటరిం జేసి మీరంద ఱేకీభవించి యట్లొనర్చిరి. కాని, నేఁడు ద్రోణ శల్య కర్ణ బాహ్లికాదులును, మహేశ్వరువరంబును గలుగ నట్లొనర్పఁ దరమా ?

మ. హరియుం బార్థుఁడు లేరు నేఁడు రణమం, దాచార్యుఁ
డీగీతి మో, హరముం బన్నెను సైంధవుం డిచట బాహాశ
క్తిన్మీఁ దాఁకె, సం, గరము స్వేడి కుటీరమందు నిలువం

గాన వెన్క భీమ యుధిష్ఠిరుఁ డాపద్ధుర మారుఁ డొంటిఁ
జనె, నిన్నె! యేల యాలాపముల్?

భీమ — కౌరవస్యాలకుఁడ వని, దుస్సల మొగమ్ముఁ జూచి
మా యన్న క్షమింప నూరకున్నందులకుఁ గదా యీరీతిఁ
బలుక నారంభించితివి?

సాత్య — ఓరీ! సింధురాజ!

ఉ. నీ తెలుఁ గట్టి దట్టి దని నేర్పుఁగ నేటికి నేఁడు మాకు?
నా, ధాత లిఖించె మున్న ప్రమదంబున నీతెలుఁ గట్టి దం
చు నా, ప్రాఁతనుబట్టియే మనుపరాభవ మబ్బెను, దానిఁ
బట్టియే, యీతఱి నిన్నుఁ బట్టి వధియింపఁగఁ బూనిరి
పాండునందనుల్.

రమ్ము. నీమద మడంచెదము. (అందఱు నిష్క్రమింతురు.)

సైంధ—(ప్రవేశించి) ఓరోరి కౌంతేయులారా! ధీరుల మను
పేరుతో నధీరులరై, కండకావరమ్మునఁ గన్నుఁగానక పర
బల స్వబలవిశేషత వీడి, కయ్యంబునకుఁ గాలుద్రివ్వినందు
లకుఁ దగినఫల మనుభవించితిరి. ఇఁకముం దనుభవింప
నుండిరి.

శా. ఔరా! దుర్మతులార! ధీరజనుఁ డుగ్రాకారుఁడై సైన్యసం
హారప్రక్రియకుం గడంగఁ దగు, హాహారావముల్సేసి, మీ
ధీరత్వమ్మును మంటఁ గల్పి, మది భీతిం జెంది, జన్యమ్మున
ద్వారం జెల్లునె? నవ్వులాట! యరిభూపవ్రాత మీక్షించినన్.

ఓరోరి ! భీమ నకుల సహదేవ సాత్యకి దృష్టద్యుమ్నాది పాండవయోధులారా! బీరమ్ము లాడి యాడి, నే ననర్గళ ప్రసారమ్ము లగుశరాసారమ్ముల నిగుడింపఁ, గరిరథహయభటావయవఖండమ్ములును, వివిధాస్త్రశస్త్రసంచయమ్ములును, భూభాగమ్మునం దొఱంగ, నిదివఱకుఁ బల్కిన ప్రగల్భమ్ముల వీటిఁబుచ్చి తపఃప్రభావుండు సైంధవుం డవి యిప్పటికిం గుర్తెఱింగి సంగరభూమి వీడి పరుగిడఁ జొచ్చితిరా? మీ రిపు డెట కేగెదరో కనుఁగొనెదఁ గాక !

(నిష్క్రమించును.)

యుయుత్సుఁడు— (ప్రవేశించి) బలే సౌభద్రా ! రౌద్రరసోల్లసితమూర్తివై మహావనముం దహించు దవానలమ్ము చందమ్మునఁ, గౌరవవాహినిఁ గలఁగుండువడఁ జేయుచుంటివి కదా? (తెరవంకఁ జూచి) విఱిగిన శతాంగంబులును విచ్చిన మొగ్గరమ్ము నవలోకించి, దుర్యోధనుండు శోకవ్యాకులితచిత్తుండై కోపాటోపమ్మున సంగరోన్ముఖుండై గడంగం బోలు ! కాకున్న శత్రుసైన్యమ్ము లావంకఁ బెల్లురేగనేల? (వినుట నభినయించి) ద్రోణాచార్యుం డెద్దియో కర్ణాదియోధుల కాజ్ఞాపించుచున్నాఁడు.

[తెరలో]

ఓకర్ణశల్యబాహ్లికాదికౌరవయోధులారా ! కిరీటికుమారుఁడు కౌరవనాథుం దాఁకుచుండ నూరకుంటి రేల? అభిమన్యుం

డు పసివాఁడని యెవ్వరికించుచుండిరా? వేగంబ చని దు
ర్యోధనుని గాపాడుఁడు.

యుయు—(తనలో) అయ్యో! వీరంద ఱేకమై సుయోధన
రక్షణకుం గడంగిరే! ఏమి కానున్నదియో కదా? (తేఱి
పాఱఁజూచి) ఆహా! అభిమన్యునిపౌరుషము! అట వియ
చ్చరులుసైతము, నిశ్చేష్టులై యెట్లు చూచుచున్నారో!
కుమారుం డాఁకఁబోవు గురు కృప కర్ణ శల్య బాహ్లిక
వృషసేన గురుపుత్త్రులొక్కుమ్మడి, నందఱ నన్నివిశిఖ
మ్ముల నొంచి, యాశీవిషమ్ము లగునమ్ముల నశ్మకుం
జదిపి, పరిపంథియోధవరుల మేనులు నెత్తుటఁ జొత్తిల్లం
జేసి, కర్ణునిపై కేగి, 'నిలు నిలు' మని ధిక్కరించి, యాఁ
కలింగొని మత్తగజమ్ముపై దూఁకు సింగఁపుఁగొదమ
చందమ్మున మీఁదఁ బడుచున్నాఁడు. ఈకర్ణునకు వినాశ
కాలము దాపరించినది.

చ. అనిశము శాత్రవాళి నుఱుమాడుకుమారున కించుకంత
యు, ర్జునుఁడును లొచ్చు, సంగరవసుంధర నుండిన శూల
పాణియున్, వినుతమహాస్త్రసంతతికి వెన్నును జూపక
పోఁడు, సూతనందనుఁ డన నెంత? యాతనిమదమ్ము న
డంగు నొకింత వేచినన్.

అయారే! రణమునఁ గిరీటిం జెనకఁగలవాఁడు తానొక్కరుఁడే
యని ప్రగల్భములువల్కునకర్ణుఁ డభిమన్యునిబారిఁబడి

లజ్జావిహీనుఁడై పాఱందొడఁగె. (విని) కుమారుఁ డెవ్వి
యోవీరోక్తుల నగ్గడించుచున్నాఁడు.

[ తెరలో ]

చ. నిలు నిలు కర్ణ! యోకృపుఁడ! నీ విట భీతిఁగనంగ నేల సా
బల! రణభూమి వీడకుము బాహ్లిక! యేమి సుయోధనా!
మహా, త్ములయిన పాండుపుత్రకుల మూర్ఖత మాయదు
రోదరమ్మునన్, గలఁచి చలమ్ముఁ బెంచినయఘుం బిట
జ్ఞప్తికి వచ్చుచుండెనే?

యు.యు — అహా! ఏమి కుమారునిచాకచక్యము. కర్ణుఁ డాం
దోళన మంది రణభూమి వీడి పరుగిడినయనంతరమ్ము
శల్యుం డెదుర్కొన నెక్కింతన నొప్పించి, మూర్ఛఁ
బుచ్చి, కుమారు నెదుర్కొన నీదెసనుండి యెవ్వరో
చనుదెంచుచున్నారు. (నిరూపించి) ఓహో! శల్యాను
జుఁడు కాఁబోలు! వీనికిం దగినప్రాయశ్చిత్తము జరుగును.
(మరలఁ బరికించి) అయ్యో! అయ్యో! శల్యానుజుని తల
డొల్లఁజేసిన కుమారుని ద్రోణాదియోధవరు లొక్కుమ్మ
డిగా నెదుర్కొనుచున్నారు. (పెదవివిఱచి) మన మెఱుఁ
గనిరథికులా యేమి? ఇదివఱ కెదుర్కొని యేమొనర్చిరి?
(చక్కఁగాఁ బరికించి) వీరందఱుఁ బలాయనమంత్రముఁ బఠిం
పుచుండిరి. కాదు. కాదు. ఆయోధవరులను వారించి దు
శ్శాసనుం డనికిఁ గడంగినట్లున్నది.

[తెరలో]

మ. భయముం జెందక నిల్వు మీవు రణభూభాగమ్మునం దస్త్ర
సం, చయముం దాల్చి నిమేషమాత్రమున నీశౌర్యమ్ము
ధైర్యమ్ము నీ, నియతిన్ స్థైర్యముఁ గూడ నేనొకఁడనే నీర
మ్ముపార్చేతు, దు, ర్ణయపూర్ణాత్మక రమ్ము కాలుపురిఁ
జేరంబోదు వొక్కింతలో.

యుయు — ఈదురాత్ముని కర్ణునాత్మజుఁ డేమిచెప్పునో ?

[తెరలో]

చ. జనకుఁడు వాయునందనుఁడు సంగరమందున నిన్నుఁ గూ
ల్చి వెచ్చనిభవదీయశోణితము సంబరమొప్పఁగఁ ద్రావు
వాఁడనం, చును బ్రతినం బొనర్చె నలసుండ! నినుఁ గడ
తేఱుపన్, బలా, యన మొనరింపు మాజిని మదాశుగ
ముల్ కడుతీవ్రముల్ సుమా !

యుయు — నిజము. కుమారా ! నిజము. ఓరీ ! దుర్మతీ ! దు
శ్శాసనా !

ఉ. సూతతనూభవుం డిటులె శూరుఁడనంచును బగ్గెలాడి, గ
ర్వాతిశయంబు నంది, సమరంబున నొచ్చెఁ దదీయబాణని
ఘాతముచేత, నీవు నటు కారులు ప్రేలఁగఁ జొచ్చినావురా
పాతకి! నీ వతండు సహపాఠకు లౌదురు భీరు లౌటచే.

చ. కురుధరణీవిభుండు రణకోవిదురీతిఁ గుమారు మీఁదికిన్
దరలి రణంబు సేయఁగ నుదగ్రత రాఁగఁ దలంచె, నంత న

గ్గురుఁడును గర్ణశల్యులును గోవిదుఁడా గురుపుత్త్రకౌశలే
శ్వరులును రాజరాజునకు సాయము వచ్చిరి మధ్య నడ్డమై.
వేసియెడల మీ రీపాటికి ధర్మజునొద్దకుఁ బాలియుమని ప్రార్థిం
ప వచ్చెడివారలే. ఓరీ! మూఢదుశ్శాసనా! నీవా కు
మారు నెదిరించెడువాఁడవు? (వెనుకకుఁ దిరిగి) ఏమిది?
యీవంక సైన్యమ్ము లిట్లల్లకల్లోల మగుచున్నవి. (కల
యఁజూచి) కుమారునియస్త్రపరంపరచే మూర్ఛిల్లిన
దుశ్శాసనుని రథమ్ముపై నిడుకొని పోవుసూతుం గాంచి
కాఁబోలు, తనతమ్మునియవస్థం గాంచి, కురునాథుం డేవి
యో తనయోధవరుల కాజ్ఞాపించుచున్నాఁడు.

[తెరలో]

ఉ. తమ్ముని దుస్ససేను బెడిద మ్మగునారసముల్ గణింప కు
గ్రమ్మగుబాణము ల్వాఱపి, గ్రక్కున వక్షముఁ జించి, జ
త్రుడే, శమ్మను నుగ్గుచేసెను భుజంగమురీతిగ నర్జునాత్మజుం
డెవ్వఁడైన వాని వధియింపుఁడు వైరులు తల్లడిల్లఁగన్.

యుయు—దుర్యోధనునాజ్ఞఁ గొని కర్ణుఁ డెదుర్కొని దస్సి.
అతనితమ్ముఁడును గుమారు నెదుర్కొని రథిక హయ
సారథులపైఁ బలుపుబాణమ్ముల నొక్కొక్కబాణమ్మునఁ
దుత్తునియలు గావించె. మరలఁ గౌరవసైన్య మంతయుఁ
గుమారునిం దాఁకి విముఖమైనది. (మెప్పుతో) బలే! సాభ
ద్రా! సమరమునందు గండరగండఁడ వని బిరుదు వహింప

నీవ తగియుంటివి. తన బెడిదంపుటంపర సహింపఁజాలక వెన్నిచ్చి పాఱు కౌరవబలమ్ము నామృగవ్యాధరుద్రుఁడో యన వెన్నంటుచుండె. విచ్ఛిన్నరథవరూధమ్ములును, విని హితపదాతియూథమ్మును, విస్ఫోటితకపాలమ్మును, విదళితమత్తమాతంగమ్మునై, భూతబేతాళకలకలమ్మున కాకరమ్మై, విజృంభించు ఫేరవ, కాక, కంకాదిసమూహమ్ములచే నిండి రణరంగ మెంతభీతిఁ గొల్పుచున్నదో! ప్రళయకాలరుద్రుండో యన నెయ్యెడఁ జూచినఁ దానయై వీరవిహారమ్ము సల్పునభిమన్యకుమారుం దాఁకుట కౌరు లెవ్వరును సాహసింపలేకున్నారు. వృషసేనుఁడు కాఁబోలుఁ గుమారుం దాఁకుచున్నాఁడు.

[తెరలో]

ఉ. కవ్వడిపుత్త్ర! సంగరముఖమ్మున నిల్చిననిన్నుఁ బట్టి నే
నెవ్విధిచేతనైన వధియింపఁగఁ జాలనె? నాదుతండ్రిమేకా
నొవ్వఁగఁజేసి బీరములు నోరికివచ్చినయట్లు ప్రేలు నీ
క్రొవ్వడఁగింపకున్నయెడఁ గ్రూరుఁడ! లోకము లాఁగనేర్చునే?

యుయు—— ఓరీ! వృషసేనా! నీతండ్రియట్టివీరుఁడే యీకుమారునెదుట ముమ్మాఱు పలాయనమంద నీ వెంతరా?

మ. బలమా సున్న, వయోబలమ్ముఁ గనఁగా బాలుండ వీరీతిగా
బలవంతు ల్పలుమందికల్గుసమరంబా చూడఁగా లేదు; నీ

కిలలో నాయువు చెల్లఁబోలు, జనకుం డేరీతిగాఁ బంపెడి
న్గలన న్వీరుని వీని గెల్వుమని వీఁకన్ బాఱఁగాఁబోకుమా.

కో. రు మెదపక తేరు మఱలించుకొనుటయె లెస్స. (తేఱిపాఱఁ
జూచి) ఆహా! ఒకశరమ్మున వృషసేనుం బాఱఁదోలి,
వసాతిభూపతిం గూల్చి, లేళ్ళగమిం బొదవు బెబ్బులిపిల్ల
చందమ్మున నురువడించుచుఁ, గౌరవవాహినిఁ గల
గుండు వడఁజేయఁ బాఱిపోవుచున్నభూకాంతులశిరమ్ముల
నుండి జాఱిపోయిన రత్నకిరీటమ్ములధగద్ధగలు నేత్రమ్ము
లకు మిఱుమిట్లుగొలుప, సంగరరంగం బాతయు దారుణ
ప్రదర్శనం బగుచున్నది. తెరలినమూఁకలు కుమారుని
మోమెత్తియైనం జూడఁజాలక, యందంద నిలువ నాగుం
పులపైఁ గవిసి, సత్యశ్రవాదిభూపాలలోకమ్మును నాక
లోకమ్మున కనిపి, రుక్మరథుఁ బడనేసి, యతనిచెలులపైఁ
గవిసి, సంకులసమరమ్ముఁ గావించుచుండెను. (మెప్పులో)
బలే! సాథ్వా! కన్నులపండువుగా భండన మాచరిం
చుచుంటివి.

[తెరలో]

ను. ఎదిరింపన్ దగుశక్తి లేక గురు నేదేరీతిగా వ్యూహమున్
విదళింపన్వలెనంచు చింతఁ గొని, నీ వీరుండవంచెంచి, దు
ర్మద మొప్పన్ రణసీమ కంపఁ గనె నీ మా తారతమ్యమ్ముల
న్మదిలో నెంచక పొల్లుమాటలని సామర్థ్యంబుఁజూపించెదే.

**యయు**—ఓహో! ఎవ్వరది? (తేటిపాఱఁజూచి) దుశ్శాసన సుతుండు కాఁబోలును! లక్షణకుమారుం గూలనేసి, కోసలేంద్రుం జంపి, వానిబంధుమిత్రాదుల యేపు మాపి, యశ్మంతకుం జదిపి, శత్రుంజయ, చంద్రకేతు, సువర్చస, సూర్యభానుఁ డాదిగాఁ గలవీరరాజకుమారుల నాకలోకమ్మున కనిపినసౌభద్రునిమీఁది కీవెఱ్ఱిదౌశ్శాసని యేల గడంగవలయు? వాని కాయువు మూడియుండఁబోలు! (రెండవవైపుఁ జూచి యాతురములో) ఏమిది? ఈవెస మహాయోధవరు లగు ద్రోణ కర్ణ శల్య దుశ్శాసన సుయోధ నాశ్వత్థామాదు లేదియో యోజింపుచుండిరి. ఆచార్యుం డుపన్యసింపుచున్నాఁడు. ఇక్కడి కాతనివాక్యమ్ములు స్పష్టముగా వినిపించుట లేదు; కావునఁ గొంత దగ్గఱ కేగి వినియెదఁ గాక.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.





శ్రీమత్పరదేవతాయైనమః

# విజయప్రతిజ్ఞ.

## ద్వితీయాంకము.

[ద్రౌపదీసహితుఁడై ధర్మరాజును, యుయుత్సుఁడును
ప్రవేశింతురు.]

ధర్మ—(విచారముతో)

మ. కలనన్ ఫల్గుఁడు లేకయుండినఁ గడంక న్నన్ను రాజేం
ద్రుముం, గల బంధించెద నంచు ద్రోణుఁడు ప్రతిజ్ఞం
జేయ, నే నాభయా, కలనన్ దప్పఁటకై కదా సమర
ముం గావింపఁ బంపించి పు, త్త్రుఁ లయుం బొందఁగఁ జేసి
నాఁడ దురితాత్ముండన్ మహాక్రూరుఁడన్.

అయ్యో! నే నెంతపాపాత్ముఁడను.

మ. "అని సేయం గలఁడొక్కొ బాలుఁ డని మాయ ల్పన్ని
యాపావన, ర్తను లేకే డానరింప నెంచెదరో? సంగ్రా
మమ్ము సేయంగ నే, నని లేనప్పుడు వాని బంపఁ దగ
దన్నా!" యంచుఁ బార్థుండు ము, న్ననియెం గాని కుమా
రునిం దుదకు నన్యాయమ్ముపా ల్సేసితిన్.

(నిట్టూర్పుఁబుచ్చి) సీ! ఎంతసిగ్గుమాలినపని సేసితిని. కులము నిలుపఁ దగుసుతుని సమీపమునకుం బుచ్చికొల్పి చంపుకొనుటకంటె, గురు నెదుర్కొని చచ్చుటయో, లేక పరాభవము నొందుటయో యైన బాగుండెడిది.

మ. చతురంభోధిపరీతభూవలయముల్ శాసించు నంచుం బృ
థా, సుతు లేబాలుని నమ్మినార లతఁడే సుక్షింగ
వా రింక నే, గతి యుద్ధం బొనరించువార లయయో!
కాంక్షల్ వృథా యయ్యె; మే మశిపాపాత్ముల మెట్లు
దక్కు సుతుఁ డీశా! యింతదౌర్భాగ్యమే ?

లేకున్న నర్జునుఁ డింటికిఁ జనుదెంచి, "అన్నా! అభిమన్యుఁ డెల్లపుడును నేను గృహమ్మునకుం జనుదెంచునప్పటికి—

చ. తననగుమోమునందమమృతాంశునిదీధితుల న్హసింపఁగా,
ననువగు బాహువల్లరుల నాదృతి కంఠముఁ జుట్టి, నేఁడు
పో, రణవిశేషము ల్గనఁగ నోయుదు" నం చనుచుండు
వాఁడు, యేఁడని యడుగంగఁ బార్థునకు హా! మృతి నే
నిఁక నెట్లు తెల్పెదన్?

అయ్యో! తండ్రీ! నీయందైనను మృత్యుదేవతకు దయ లేక పోయెను గదా!

యుయు—అన్నా! ఏల యింత వెఱ్ఱి? ఎవ్వారికైనను దయ కలుగునే కాని మృత్యువునకు దయ యెక్కడిది? రత్నఖచితసింహాసనం బధిష్ఠించురాజాధిరాజును, కష్టపడి,

కాయకసరు లేఱుకొని పాలము దున్నుకొనుకర్షకుఁ
డును, నిరాహారియై ముక్కుమూసికొని కాననగుహాం
తరములఁ దపం బాచరించుకొనుయతీంద్రుఁడును, నిరం
తరప్రాపంచికసుఖాస్వాదుఁ డగుకాముకుఁడును, ప్రపం
చమే తనకుటుంబముగ నెంచి వారలసుఖదుఃఖమ్ములు
తనవిగ భావించులోకహితుఁడును, కాకివలె స్వార్థపరుఁ
డై స్వోదరపూరణం బొనరించుకొనునేకాకియుఁ గూడ,
మృత్యువునకున్నుల కొక్కటియే. భగవత్తేజమ్మున జన్మిం
చినశ్రీరామాదులకే మృత్యువు తప్పనియప్పుడు, మన
మా తప్పించుకొనఁగలవారము? అదియునుంగాక—

మ. కరవాలమ్మును జేతఁ బూని, యతిధిక్కారమ్ముఁ గావిం
చుకే, పరిచండమ్మున వైరిపక్షగతులౌ క్ష్మాపాలురం జం
పుటో, కరమర్థిన్ రణరంగమందుఁ బడి స్వర్గం బందుటో,
కాక భూ, వరు లాసించెదరయ్య! అన్యఫలముల్ వం
తం గనం బాడియే?

ఐనను రణరంగమ్మునఁ బడి యెంతమంది రాజకుమారులు
చావలేదు! వారలవలెనే యుద్ధరంగమ్మునం జదిసినకు
మారునికై యింత వగవఁ దగునా?

ద్రౌప— నాయనా! యుయుత్సుఁడా! అందఱు రాజకుమా
రులు నభిమన్యునకు సాటివచ్చెదరా? వారికి మేనల్లుఁడు;
వాసవుసింహాసన మధిష్ఠించిన కిరీటికొడుకు; అసాధా

రణధనుర్విద్యాధురీణుఁడు; పాండవకులాంకూరము— (వి
చారముతో) అయ్యో! సౌభద్రా! ఎన్నఁడును నీతల్లి
నొకరీతిగను, నన్నొకరీతిగను జూచి యెఱుఁగవు. తం
డ్రీ! నీయాకార మెంతమఱపునకుఁ దెచ్చుకొందమన్నను
మఱపు రాకున్నది.

యుయు—ఎవరిపుత్త్రు లెవరికి వెగటుగఁ దోఁతురు? తల్లీ!
యూఱడిల్లవలయును. గతించినవానికై వగచిన లాభము
లేదు.

ద్రౌ—అయ్యో! పుత్త్రకా! గోలయగు విరాటరాజపుత్త్రి
నూఱడించువార లెవ్వరు? శశిరేఖ నెవ్వరి కప్పగించి
తివి? నీకై తనయస్థుల ధారవోసి పుత్త్రశోకమునం గుం
దుచున్న సుభద్రముఖంబైన నొకసారి చూడఁదలఁచుకొన
లేదా? మాయందఱిపై నీ కింతకోప మేల తండ్రీ?

ధర్మ—(విచారముతో) అయ్యో! నిష్కారణముగ నే నేల
బ్రదికియుంటిని? ఈయుద్ధం బెందుల కవలంబించితిని? ఇట్టి
పుత్త్రు నెందులకై చంపుకొంటిని? హా! దైవమా!

శా. వంతం బొప్పఁగ శత్రుపాలితమహాపాపాత్మ యా పాడు
భూ, కాంతం గోరి మహారణంబునకుఁ గ్రొంకంజేయ కొ
ప్పించు, దా, స్వాంతంబుం దగురీతి శిక్ష నొనరింపంగా మ
నంబూనితే, వంతం గూర్పఁగ న్యాయమా? కరుణ యా
వంతైన నీ కున్నదే?

యుయు—(తనలో) అయ్యో! వీరి నేమని యూఱడింతును. పాండవకులమ్మును నిలుపఁ దగువాఁ డనియైన భగవంతుఁడు దయఁ జూపలేదు కదా? సద్ధర్మానువర్తు లగుపాండవుల కీదుఃఖపరంపర యేల? మనస్థైర్యముఁ బరీక్షించుటకై సాధువులకే భగవంతుఁ డాపదల వెంబడి నాపదలను గల్పించుచుండును గాఁబోలు! (ప్రకాశముగా) అన్నా! ధర్మజా! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఇదంతయు నా సైంధవచండాలునివలనఁ బ్రాప్తించినది. నాఁడే వానిని మీరు కరుణ జూపింపక చంపిన యీముప్పు రాకయుండును. గతజలసేతుబంధన మేల?

ధర్మ—యుయుత్సుఁడా! మొదటినుండియు మీయన్నగారికరుణకుం దగినఫల మనుభవించుచునే యున్నాము. (ఆలకించుట నటించి) అదె! కృష్ణార్జునులరాకను. బాంచజన్యదేవదత్తధ్వనులు తెలియఁజేయుచున్నవి. సంశప్తకుల నోడించితి మని యుగ్రజుం జూడవచ్చు నాతని కీవార్త యెంత హృదయభేదకముగా నుండునో కదా?

ధర్మరాజు—(తనలో) అయ్యో! కృష్ణార్జునులు లోనికి వచ్చుచున్నవారు. ఛీ! సిగ్గుమాలినప్రాణమా! ఇంకను యీతనువును విడచి పోకుంటి వేల? (ద్వారమునొద్ద కరుదెంచి ప్రకాశముగా) హా! అభిమన్యుఁడా! నీతండ్రితో నీకరా-

క్రమము వినిపించుటకుమారు నీచావా తెలుపఁదగినది?

(మూర్ఛిల్లును.)

[ద్వారమునొద్దఁ గృష్ణార్జునులు ప్రవేశింతురు.]

అర్జు—అయ్యో! కృష్ణా! నీవు చెప్పక దాఁచినను దాఁగినది కాదు కదా! దారిలో నాకు దుర్నిమిత్తమ్ములు గన్పడినది మొదలు నే ననుమానించుచునే యుంటిని. (విచారముతో) హా! అభిమన్యుఁడా!

సీ. మాపుణ్యముల ప్రోవు, మాదునోములపంట,
మాప్రేమధామంబు, మాదుమురువు
మాకూరుములదీవి, మాపెన్నిధానమ్ము,
మాసంతసముప్రాపు, మాదుమాట
మాసుందరాంగుండు, మాగారములకూచి,
మాదుప్రేమసదమ్ము, మాదు చేవ
మాకన్నుఁగవవిందు, మావీరతిలకమ్ము,
మాబల్మి, మాకల్మి, మాధనమ్ము

తే. గీ. మాదురెండవప్రాణమ్ము, మాగుణఖని
మమ్ము విడనాడి దేవలోకమ్ముఁ జేరె;
నెట్లు జీవింతు మింక మే మెవరికొఱకు?
మాలదైవమ్మ! తగునె కుమారుఁ గూల్ప?

సీ. వదనమా యది? కాదు, వరకళాసంయుతం
బంబుజవైరిబింబంబు గాని

కరములా యవి? కావు, కమనీయసామ్రాజ్య
భవనమ్ము నిల్పు స్తంభములు గాని
కన్నులా యవి? కావు, కనుఁగొన నవఫుల్ల
రమణీయపద్మపత్త్రములు గాని
వక్షమా యది? కాదు, వరలక్ష్మి నివసించు
కమనీయ మహా గృహాంగణము గాని

తే. గీ. అవని యనునుదయాచల మందుఁ బొడమి
మించెడుతమఃపథ మతిక్రమించి చనెడు
బాలభానుండ వీవు కన్పడకఁ జనితె?
ఆశ లన్నియుఁ గప్పి దుఃఖాంబుదముల.

అయ్యో! కృష్ణా! మున్నెంతటిపాప మార్జించియుంటినో కదా!

కృష్ణు—అర్జునా! ఏటివెఱ్ఱి యిది? మనపురాకృత మెంత యో యంతయే యగును. దైవముమాత్ర మేమిచేయఁ గల్గును? అర్జునా! ఈప్రపంచక మొక నాటకశాల; ఇందలిప్రజలు నటకులు; కొందఱు ముందుగను మఱి కొంద ఱాలస్యముగను తెరచాటునకుం బోవుదురు. దీని కింత విచార మేల? ఉన్నంతకాలము ఇది నాభార్య, వీడు నాపుత్త్రుఁడు ననువిచారము తప్పదు. పోయినవెనుక యెవరికివారే. ఏజన్మముననో ఋణశేష ముండె, నది యంతయు నిప్పుడు తీర్చుకొని పోయెను. ఈజగత్తంతయు మాయాపరికల్పితము.

తే. గీ. జలధితరగలఁ జలియించి కలసి మఱల
సరగ నరిగెడి కాష్ఠసంచయమురీతి
మనుజు లెల్లరు సంసృతివనధిమధ్యఁ
బడుచు సంయోగమును గాంచి బాయుచుందు).

అర్జునా! నీవంటి ధైర్యవంతున కిట్లు కుందుట తగదు. ధైర్య
మవలంబించి యూఱడిల్లుము.

ధర్మ—(మూర్ఛనుండి లేచును.)

అర్జు—కృష్ణా! నే నెట్లూఱడిల్ల నేర్తును ? (ధర్మజుని గాంచి)
అగ్రజా! నేను లేనప్పుడు వానిని యుద్ధమ్మునకుఁ బంప
వద్దని చెప్పలేదా?

ధర్మ—(అర్జునుని సమీపించి కన్నీటితో) నీవాక్యమ్ముల
వీటిఁబుచ్చి గురుఁడు పద్మవ్యూహమ్ముఁ బన్నిన నాపా)
ణమ్ములకై భయంపడి కుమారుని యుద్ధరంగమ్మున కం
పించి చంపుకొనినదురాత్ముఁడను నేను. ఆపాపమ్ము
నకు ఫలమ్ముగా నా యీకంఠము నీకరవాలమునం
దునుముము.

కృష్ణు—ధర్మజా! నీవుమాత్రి మేమిచేయుదువు? వాని కా
యువు మూడినది.

అర్జు—(విచారముతో) అయ్యో! అభిమన్యుఁడా! కలకల
లాడు నీనవ్వుమొగమ్మును, ఆకర్ణాంతములైన నీకన్ను
లును, జానువుల నంటెడికరమ్ములును, విశాలవృక్షస్థల

మ్మును, గల నీయుంద మ్మాతయు స్మరణీయ మయ్యెనే?
తండ్రీ! (ధర్మజుదిక్కై) అగ్రజా! కుమారుని యుద్ధప్ర
చారము సుంత తెలియఁబఱపుము. కుమారుని ముఖప
ద్మముఁ జూచుభాగ్యమ్ము లేకున్నను, పరాక్రమమైన
విని సంతసించెదను.

ధర్మ — నాయనా! చెప్పుటకు నాకు నోరాడదోయి! సూత్ర
పాయమ్మగా యుయుత్సుఁడు చెప్పినమాటలం బట్టి,
త్రిశూలధారి యగు నీశ్వరుఁడైన నాతని నెదిరింపఁజాలఁ
డని నిర్ణయించుకొంటిని. (యుయుత్సునిదిక్కు మొ
గంబై) యుయుత్సుఁడా! కుమారుని యుద్ధమ్మును గూర్చి
మఱియొకసారి మాకందఱ కెఱింగింపుము.

యుయు — అర్జునా! గురుఁడు ధర్మజునిఁ బట్టుటకై నీ విచట
లేవనియెంచి పద్మవ్యూహమును బన్నె నని నీ వెఱింగినదే
కదా? దాని తెఱం గెఱింగినవాఁడు తా నొక్కండ య
గుటఁ బెదతండ్రిం గావ యుద్ధమ్మునకుం బోయి తమ్మి
మొగ్గరమ్ము నవలీలఁ జించి లోనికిం బ్రవేశించి,

చ. కడలిని ద్రచ్చు మందరపుకవ్వమురీతిగ శత్రుసైన్యమం
దడరి నృపాలవర్గము యథాయథలై మది తల్లడిల్ల న
ల్లడలకుఁ బాఱుచుండఁగను, కవ్వడి! నీసుతుండు వెగ్గెనే
కడఁ గనుఁగొన్న దాన యయి కౌరవవాహిని రూపు
మాపుచున్.

సంగరముఖమ్మున నభిమన్యు నెదిరింపఁజాలక చదిసిన శ
త్రుంజయ లక్షణాదిరాజకుమారులు వేనవేలు. సుయో
ధనుం డంతఁ గర్ణాదియోధవరులతోఁ గూడి,

ఉ. దృక్కుల కందకే గగనదేశమునందు దివాకరుండు, తా
దిక్కులనిండ స్వీయ మగు తేజము నింపి వెలుంగుభాతి నీ
చక్కనిచుక్క యుద్ధమున సాంగఁగ నోర్వఁగ లేక యెంత
యున్, మిక్కుటమౌ భరమ్మునను మే న్వడఁకన్ గురునా
ద్దకుం జనెన్.

చని, గురువర్యా! మీరే యిట్లూరకున్న యెడల మేమెట్లు
సహింతుము. ఈయభిమన్యునిబారినుండి తప్పించు
కొనుట కుపాయ మ్మెం దెద్దియేని యోజింపవే యనుడు
ద్రోణుం డి ట్లానతిచ్చెను.

మ. నరుఁ డత్యద్భుతవిక్రముం డతనికన్న న్మిన్న యీబా
లుఁ డీ, ధర నెవ్వా రెదిరింపఁజాల రితనిన్ ధర్మమ్మువో
నాడుచున్, విరథున్ జేసి, ధనుస్సు ద్రుంచునెడ నీవీరుం
డు కూలున్ ధరా, వరులారా! యిఁకనైన మీర లతనిన్
బంధింప యత్నింపుఁడీ.

అర్జు—అయ్యో! కుంభసంభవా!

ఉ. అంకముఁ జేరఁదీసి ప్రియమారఁగ మూర్కొని శీర్షమిం
పుగాఁ, జెంకలఁ బట్టి దువ్వి "కడు చేవ దలిర్చెడుజోదు
వౌదు; మీ, వాంఛుఁడ! పార్థపుత్త్రుఁడ చిరాయువు గ"

మ్మని యన్నమాట నే, బొంకుగఁ జేసితయ్యా! యెటు
పూర్వపుఁ బ్రేమను వీడనాడితో?

తరువాతఁ, దరువాత?

యుయు—అంతఁ బాపాత్ము లగుసుయోధనాదులు కుమా
రుని విరథుని గావించి, విల్లు దునిమిరి. అయినను గుమా
రుండు ధైర్యమ్ము సెడక, దుశ్శాసనసుతుతో ద్వంద్వ
యుద్ధమ్మునకుం డీకొని, వానితోఁ గలిసి స్వర్గమ్ముఁ
జేరెను.

అర్జు—అయ్యో! కుమారా! ఇంతటి జగదేకప్రతాపుఁడ
వగు నిన్నుఁ బోఁగొట్టుకొని నేను జీవించుట యెందులకుఁ
దండ్రీ! అన్నా! ధర్మనందనా! కుమారు నొంటిగ నేల
పంపితిరి? మనభీమసేనాదియోధవరు లెవ్వరును దో
డరుగ లేదా?

యుయు—అన్నా! మే మెల్లరమునుగూడఁ బోయితిమి కాని
దారిలో మాకందఱ కనివార్యుఁడై సైంధవుఁ డడ్డమై ని
లిచె. అందుచే భీమాదులులోనుగాఁగల మే మఱిగినలా
భము లేకపోయినది.

అర్జు—(కోపముతో) అరే! కృతఘ్నా! సైంధవచండాల! ఎం
తపని జేసితివిరా! నాఁడు వనమ్మున దయఁ జూపినందు
లకుఁ దగినఫల మనుభవింపఁ జేసితివి. కావున—

చ. ఇనుఁ డపరాద్రి బోకమును పెల్లి వధింతును సింధుభూ
పు న,య్యనిమిష దైత్యకింపురుషులాదిగ నెవ్వరు గావ
నెంచినన్, వినుఁ డిదె నాప్రతిజ్ఞ నలవిద్విషుఁ జంపఁగ లేక
పోయినన్, అనలముఁ జొచ్చి ప్రాణముల నయ్యెడఁ బా
సెద గాండివమ్ముతోన్.

కృష్ణు—(తొందరతో) అర్జునా! ఇంత తొందర చెల్లునా?

శా. నాతోడం దలపోయ కిట్టు లసమానం బౌ ప్రతిజ్ఞన్ గిపు
వ్రాతంబుల్ వినఁ బల్కఁ జెల్లునె? రణప్రాజ్ఞుండ వయ్యు
య్యో! యీభాతి వ్వారల నల్పులంచుఁ దలఁతే? భారమ్ము
ద్రోణాదు లెం,తో తాత్పర్య మెలర్పఁ బ్రోచు నలసింధు
క్ష్మాధవున్ గూల్పఁగన్.

అర్జు—జనార్దనా! ఏల యి ట్లధైర్యముం గొల్పెదు?

మ. బలిమిన్ సంగరమందు నిల్చి కనఁగాఁ బ్రాణమ్ముల న్వీడి
భూ,తలనాథుల్ పలుమంది కూలుదురు, రాధాపుత్త్రశ
ల్యాదిదు,ర్బలులన్ సైంధవుఁ దున్మనేరనొకో? యోవార్ష్ణే
యా! నే నల్గినం, గలరే లోకమునందు డీకొనఁగ నీకారు
ణ్యామే యుండినన్?

కృష్ణు—పార్థ! నీ పట్టిదిట్టవే యనుకొమ్ము. నే నందుల కన
లేదు. సూర్యాస్తమయము గాకుండఁగనే జయద్రథునిఁ
గూల్చెద నని కదా నీప్రతిజ్ఞ? దానికై దైవసహాయ్యమ
వసరము. పశుపతియస్త్రమ్ము నీ కిప్పట్టున మిక్కిలి యుప

కారి కాఁగలదు. అందువలన, నీవు శుచివై పాశుపతశు
ద్ధికై కృషి చేయవలసియున్నది. రమ్ము పోవుదము. పుత్రి
శోకాతుర యగు మా చెల్లెలి నే నూఱడించెదను. ధర్మజా!
నీవు భీమాదుల నూఱడింపఁ బొమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

వీధి.

సైంధవుఁడు — (ప్రవేశించి విచారముతో) అక్కటా! ఇదేటి
ధర్మము?

ఉ. మానధనుండు కర్ణుఁడును మద్రనృపుండు, గురుండు ద్రో
ణియున్, మానవనాథుఁడుంగలుగ మధ్యమపాండవుఁ డల్గి
యేలకో?, యెనొకరుండనే తనకు నగ్గొనరించితినంచు నెం
చితాఁ, బూనెఁ బ్రతిజ్ఞ నన్నుఁ బొరిఁబుచ్చఁగ, ధర్మము
వీడి కుద్ధుఁడై.

కటకటా! నా కింకెవ్వరు దిక్కు? అసాధారణధనుర్విద్యా
ప్రవీణుఁ డగు నర్జును నెదుర నిల్చువా రెవ్వరు?

కం. కవ్వడితో డం బోరఁగ
నెవ్వరునూ లేరు ధరణి; యుద్ధధరుండే
నొవ్వఁగ, నవ్వరి కగు నా
కవ్వడితో నెదిరి నిల్చి కయ్యము సేయన్?

నే నిప్పు డాచరించవలసిన దేమి? (యోజించి) వనముల కరి
గి కాని, పాండవుల శరణుజొచ్చి కాని ప్రాణరక్షణ మా

చరించుకొనవలయును. (నిట్టూర్పుఁబుచ్చి) అయ్యో! ఏమి నాదౌర్భాగ్యము? అభవదత్తవరమ్ముచే నర్జునునకుం దక్క తక్కిన పాండవుల కనివార్యుండనై, ముందువెనుక లారయక, సూతునిహితోపదేశ మాలింపక, యభిమన్యుని మృతి కే నేల కారకుఁడనైతిని? సూతుఁడన రథికునిసే మము కోరువాఁడే కదా? అతఁ డేమనియెను?

తే. గీ. "కొమరు నొంటిగఁ జంపిరేని కోపభరము
వలనఁ బార్థుండు రణమునఁ జెలఁగి యేమి
సేయునో సుంత యోజింపు సింధురాజ!
తొందరను బొందు టొప్పునే సమరమునందు?"

అనియెను గదా? అట్టిహితోపదేశమ్మును ద్రోచిపుచ్చిన నా యట్టివాని కిట్టిచెట్ట గాక యింకేమిరాఁగలదు? ఈశ్వరవరంబు గల దనుగర్వముచేఁ గన్నుఁగానక, యిట్టిచెట్టఁ దెచ్చుకొంటిని. (ఆకసమువంకఁ జూచి) అయ్యో! పరమేశ్వరుఁడా! నీవు వర మొసఁగి నా కెంతముప్పుఁ దెచ్చిపెట్టితివి? (తలపంకించి) పాప మాతఁ డేమి చేయుచు? గంగాధరుఁడు మిగుల దయాళుఁడు. ఇంతకు నాగ్రహచారము నన్నిట్లు వేఁపుచుండ దైవమును దూరు టనుచితము. (నిట్టూర్పుతో) ఆపాండవులనే శరణుఁ జొచ్చెదఁ గాక! (కొంచెము నడచి) ప్రత్యర్థుల శరణు జొచ్చుట క్షత్రియుల కుచితమా? అంతకన్నఁ జావు మేలు కదా? (ఊరకొని)

కాదు, కాదు. "బ్రదికియుండిన శుభములఁ బడయవచ్చు" ననికదా పెద్దలు చెప్పుదురు. కావునఁ బాండవుల శరణు జొచ్చుటయే కర్తవ్యము. (మరల యోజించి) అర్జునుఁ డేమిప్రతిజ్ఞఁజేసెను? ఎల్లి సూర్యాస్తమయమునకు నన్నుఁ జంపలేకున్నఁ దాను జచ్చెద ననికదా? అందుచే నే నిప్పుడు శరణనుటయేతడవుగా వారు నన్నుఁ బట్టిమట్టుపెట్టుదురు. అంతకన్న వనమ్ములకరిగి యెల్లిసూర్యాస్తమయము వఱకు దాఁగి ప్రాణరక్షణ మొనర్చుకొనుటయే యుక్తము. (కనులుమూసికొని) ఛీ! క్షత్రియుఁడనై జనించి, పౌరుషము వీటఁబుచ్చి పలాయన మయ్యె నని ప్రజలు హాసింతురే మో? అంతవఱకేల? మాయావి యగుకృష్ణునిప్రోత్సాహమున నర్జునునాశుగమ్ము లరణ్యమ్యునునున్న నన్నుఁ గనుఁగొనలేకుండునా? వాఁడు నావెంటనంటిన నేఁ జేయున దేమి? అడవులకరిగినను గార్యము కనుపింపదు. ఇక్కడనేయుండిన ద్రోణకర్ణాదియోధులు నన్ను రక్షించిన రక్షింపఁ గలరు. కావున సుయోధనాదియోధులతో యోజించి వారియాజ్ఞానుసారముఁ వర్తింతుఁ గాక.

(నిష్క్రమించును.)

---

## దుర్యోధనుని గుడారము.

[అంతఁ దెర నెత్తఁగా సుయోధన, కర్ణ, కృపాశ్వత్థామ శకునులు ప్రవేశింతురు]

సుయో—మిత్రమా! అంగరాజ! పాండవులశిబిరమువంక మహాకలకలముతో సింహనాదమ్ములు వెలువడినవి; కారణ మేమైయుండును?

కర్ణ—రాజా! ఆశ్చర్యముగానే యున్నది. కుమారుని చావునకై విచారింపక యీరీతి సంతోషవిజృంభితు లగుటకు మహత్తరమైన కారణమే యుండవలయును.

శకు—ఒకవేళ నుశర్మకు లాపార్థునిచే హతులైరని కాఁబోలును.

కృపా—అట్లు కాదు. అర్జునుఁడు రణమునుండి వచ్చి కుమారునికై విచారించుచుండె నని వినియుంటిని.

సుయో—ఓరీ! సేవకా!

సేవ—(ప్రవేశించి) ఏమి యాజ్ఞ?

సుయో—నీ వరిగి పాండవులశిబిరమువంక సింహనాదమ్ములు చేయుటకుఁ గత మరసి రమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి వెంటనే మరలఁ బ్రవేశించి) దేవా! తనకుమారునిమృతి కాజయద్రథుఁడే కారకుఁడని, కిరీటి కోపించి, వానిని రేపు మార్తాండుఁడు గ్రుంకకుండ వధించెదననియు, అట్లు చేయకపోయినయెడల గాం

జీవమ్ముతోఁగూడ వహ్నిం బ్రవేశించెద ననియుఁ బ్రతిజ్ఞం బట్టెనఁట! (తెరవంకఁ దిరిగి) అదిగో! సింధురాజేంద్రుఁడు దీనాననముతో నిట్లేతెంచుచున్నాఁడు.

సైంధ—(ప్రవేశించి) బావా! రక్షింపుము. రక్షింపుము.

(సుయోధనుని పాదములపైఁ బడును.)

సుయో—(సైంధవుని లేవనెత్తి) సింధురాజ! ఏల యిట్లధైర్యపడెదవు? కుమారునిమరణము నాలించి దుఃఖాకులమానసుఁడైన కిరీటివాక్యమ్ముల కింత యులుకఁ జెల్లునా?

సైంధ—బావా! అతనిప్రతిజ్ఞ సర్వసాధారణమైనది కాదు.

చ. అనలసమానగాండివము నందినమాత్రన తల్లడింతు ర
య్యనిమిషదైత్యకింపురుషులాదిగ, భూజను లేమి లెక్క నన్
దునుముఁగఁ బూనె నెల్లి నలతోజమిత్రుఁడు గ్రుంకకుండ నే
వనముల కేగెద న్గలనఁ బార్థు నెదుర్పఁగ నాకు శక్యమే?

సుయో—జయద్రథా! ద్రోణ కర్ణ శల్యాశ్వత్థామాదు లుండ నీ విట్లు వాపోవ నేల? (కర్ణునివైపు తిరిగి) సఖా! అంగరాజ!

మ. తనయుం డీల్గెనటంచు నొవ్వక, మహాదర్పోద్ధతిన్ సైం
ధవుం, దునుమం బూనెఁ గిరీటి, వింటివి కదా? దుర్మార్గుఁ
డేమంచుఁ దా, మనమం దెంచెనో? సంగరమ్మునను నే
మాడ్కిం బ్రవర్తింపఁగాఁ, జనునో? తెల్పుము, సింధుభూ
ధవుని రక్షాతత్పరత్వమ్మునన్.

కర్ణు—సఖా! సవ్యసాచిప్రతినకు మనము సంతసింపఁ దగిన
దియే. ఏమంటివా?

మ. రవి యస్తాద్రికి నేగునప్పటికి నో రాజేంద్ర! నీబావ సైం
ధవుఁ గూల్పంగను, లేక తక్కినయెడన్ దాఁ బ్రాణముల్
బాయఁగా, దివిజాధీశసుతుండు వల్కె; మది భీతిం బొందఁ
గా నేల? సైంధవుఁ గూల్పన్ వశ మొకొ్క యొక్కనికి
రాధానందనుం డుండఁగన్?

అదియునుంగాక, నింకొక్క విశేషమ్ముకూడఁ గల దాకర్ణింపు
ము. పాండవులైదుగురిలో నెవరుసమసినను, దక్కినవా
రందఱును, బ్రాణమ్ములఁ బాయునట్లు వా రేర్పాటు చే
సికొనియుండిరి. కావున నింతటితోఁ బాండవులు చచ్చి రని
తలంపుము.

శకు—రాధేయా! పాండవు లట్టిదుర్వారప్రతిజ్ఞాపాశబ
ద్ధులు గాన, మన మీసైంధవు నొక్కడ సూర్యాస్తమయ
మువఱకు దాఁచితి మేని—

చ. దురమున సైంధవుం గనక దుఃఖము నంది కిరీటి యీల్గు, నా
మరణముఁ గాంచి చత్తురు యమాత్మజభీములు, మాద్రి
సూను లా, తెరువునఁ బోదు రందఱును దీరుదు రంత
సుయోధనుండు రాజ్యరమ నిరంకుశవ్రతిభ నమ్మతి నే
లును సంతసింపుచున్.

కర్ణు—(వేవముతో) గాంధారరాజ! ఎంతనీచపుంబనికిఁ బూ

రిక్కాల్పితివి ? మన మోపినంతవఱకు సింధురాజును గవ్వ
డి బారిc బడకుండc, గాపాడవలయుం గాని, యిట్లు క్షత్రి
యోచితమ్ముగానికార్యం బాచరింపు మందువా ?

తే. గీ. సమరమందున శత్రులc జంపుకొండె
శత్రుచేతను దానైనc జచ్చుకొండె
క్షత్రియుం డాచరించెడు సమరవిధులు
విప్రులకుc జెల్లు నీచెప్పువిధము జేయ.

అశ్వ—(కోపముతో) ఓరీ! సూతపుత్త్రా ! ఏమంటివి ?

తే. గీ. "సమరమందున శత్రులc జంపుకొండె
శత్రుచేతను దానైనc జచ్చుకొండె
క్షత్రియుం డాచరించెడు సమరవిధులు
విప్రులకుc జెల్లు నీచెప్పువిధము జేయ."

అనియా ? మూర్ఖుcడా ! నీచరిత మెవ్వ రెఱుcగనిది.

సీ. పాంచాలభూపుత్త్రి పరిణయమ్మునc బార్థు
డెదిరింపcగా నీవు బెదరలేదా ?
ఘోషయాత్రకుc బోవc గురుపతిc గంధర్వుc
డెదిరింపcగా నీవు బెదరలేదా ?
హాలపాణితో వియ్య మంద నేగితి మందు
భీమపుత్త్రుc డెదుర్ప బెదరలేదా ?
ఉత్తరగోగ్రహణోత్సవమ్మునc బార్థుc
డెదిరింపcగా నీవు బెదరలేదా ?

తే. గీ. భండనమ్మున నీ వొకపండితుఁడవె?
అంతతోఁ గట్టిపెట్టక యధిపుఁ జేరి
భీరు లీవిప్రులంచును మీఱినంత
క్షత్రియుఁడ వౌదువే సూతపుత్త్ర నీవు ?

కర్ణ— (కోపముతో) ఓరీ! బ్రాహ్మణాధమా! నన్నధిక్షే పించెద వేమి? నీవుమాత్ర మాయారణమ్ములఁ బరాజయ మందలేదా?

అశ్వ— కాని, నీవలె నొకరి నధిక్షేపింప లేదు.

కర్ణ— ఇప్పుడు నే నధిక్షేపించిన దేమి ?

అశ్వ— "విప్రులకుఁ జెల్లు నీచెప్పు విధము జేయు" నని బ్రాహ్మణతిరస్కార మొనర్ప నేల? బ్రాహ్మణప్రసాదమ్మునఁ గాక నీ వెట్లు లీయంగరాజ్యాధిపత్యము వహించితివి ?

కర్ణ— విప్రులు సహజభీరువు లనులోకోక్తి కంటిని గాని మిమ్మధిక్షేపింపవలయు నని కాదు.

అశ్వ— (ఎకసక్కెముగా) ఆహా! ఏమి వాగాడంబరము? విప్రులు సహజభీరువులును, సూతకులాధముండవు నీవు సహజశూరుండవు కాఁబోలు! ఓరీ! దుర్మతీ! బ్రాహ్మణులలో నెందఱువీరులు లేరు; క్షత్రియులలో నెందఱు భీరులు లేరు! తారతమ్యవిచక్షణ మొనరింప నీ వెంతటివాఁడవు?

సీ. పరశురాముఁ డను బ్రాహ్మణవర్యుండు
పట్టి రాజుల మట్టుపెట్ట లేదా?
గురుఁడు ద్రోణాచార్యుఁ డరయ విప్రుఁడు గాఁడా?
స్రుక్కించి రాజుల మ్రొక్కుఁ గొనఁడా?
అతని శ్యాలకుఁడు, కృపాచార్యుఁ డాయొజ్జఁ
బోరిలో నెదిరించువారు కలరో?
శాపచాపాయుధసాధనమ్ములతోడ
విప్రులు విహరింప బెదర లేదా?
తే. గీ. మాకు నీకును దారతమ్యమ్ము భీష్ముఁ
డేర్పఱుపలేదా? నీ వది యెంచకుండ
భీరు లని మమ్ము దూషింపఁ గౌరవేంద్రుఁ
జూచి ని న్జంపకుంటి నోసూతపుత్త్ర!

కావున నోరు విప్పక కర్తవ్య మాలోచింపుము; లేదేని రాజున కపకృతిఁ జేయవలసి వచ్చును.

కర్ణ—ఓరోరి కుంభపాత్రా! ఊరకున్నకొలఁది నోరికివచ్చి నట్లు వదరుచుంటివి. రాజును జూచి యూరకుంటి వేమి?

ఉ. ఆలముఁ జేయవచ్చినదురాత్ముఁడ వంచు నెఱుంగలేక, భూ
పాలుఁడు నిన్ను నమ్మి, నిటు పల్కుచు నుంటివి; తిన్నయిం
టివాసాలను లెక్కపెట్టుగతిఁ జాలును చాలును వాగఁబో
కు మీ, వాలునఁ ద్రుంతుఁ బ్రేలినఁ జివాలునఁ జేతులు దో
యిలింపుమా. (అని మీఁద కుఱుకఁబోవును.)

సుయో—(కర్ణుని బట్టుకొనును.)

అశ్వ—(కోపముతోఁ గరవాలము నూడఁబెఱికి) ఓరీ! వృథా బ్రాహ్మణాపహాసీ!

మ. కురురాజుం గని యూరకుంటి ననుసంకోచమ్మునం బోఁద్రో
లి, సంగరమందుఁ నను మార్గణం గడఁగునీగర్వమ్ము
సర్వమ్మికం, బరిహారమ్మొనరింపకున్నయెడల న్వ్యాక్యా
రుఁ డంచున్ భువిన్, ధరణీదేవులు గేలిసేయుదురు నిందా
పాత్రి! రా రమ్మికన్.

(కత్తి నెత్తి కర్ణుని నఱుకఁబోవును.)

కృప—(తొందరతో నశ్వత్థామను బట్టుకొని) ఆచార్యనందనా! మీ రిట్లు కలహింపఁదగిన సమయమా యిది?

అశ్వ—మామా! న న్నేల వారించెదవు? విడువుము. విడువుము. దుర్మార్గుం డగు నీసూతకులకళంకుని వధించి లోకము నిష్కంటకముఁ గావించెదను.

కర్ణ—రాజా! సుయోధనా! విడువుము. విడువుము. ఏమి చేయఁగలఁడో చూచెదను.

కృపా—కుమారులారా! కర్ణాశ్వత్థామలారా! రిపులు నవ్వుటతప్ప నిట్టికలహమ్ములవలనఁ బ్రయోజన మేమి?

సైంధ—మహాత్ములారా! మీరు పరస్పరకలహము లుడిగి నన్ను రక్షింపుఁడు.

కృపా — జయద్రథా! ఈవిషయమ్మున నీవు భీతి నొందఁ దగ దు. ఆచార్యునితో నాలోచింపక, మనము నిర్ణయింపఁ దగు కార్యము లేదు. కావున నట్లొనర్తము.

సుయో — మహాత్మా! మంచియుపదేశ మొసఁగితిరి. సైన్యా ధిపత్య మాతఁడు వహించియుండ మన కేమికొఱంత కల దు? వారియొద్ద కరుగుదము రండు.

అశ్వ — ఆహా! ఏమి నీతివాక్యపరంపర? ఏమియాచార్యునిపైఁ గలభక్తి? అందిన జుట్టును నందకున్నఁ గాళ్లును బట్టుకొను నీయంతవానిసే నెందును గనలేదు. బ్రాహ్మణనిందం జేయు దురాత్మ నదల్పలేక యూరకొని, యిప్పు డవసరసమ య మగుటచే నాచార్యునితో నాలోచనయా? ఆచార్య లేమొనర్పం గలరు? వారు విప్రులు, భీరులు. ఈ కర్ణుఁ డన్నిట సమర్థుఁడు. శూరుఁడు. నీ నమ్మినబంటు. సింధురాజును రక్షింప వలంతి. ఆచార్యునాలోచన మి తఁడు సాఁగనిచ్చునా? సాగనిచ్చిన నీవు సాఁగింతువా? ఏల వృథాయత్నము? కర్ణునితో యోజించి సంగరమ్మునఁ జచ్చుటయో, వనమ్ములకుఁ బాఱుటయో నిశ్చయించు కొనుఁడు. ఇం దాచార్యులతో యోజింపవలసినది లేదు. ఉన్నను నేను రాను.

సుయో — తమ్ముఁడా! ఆచార్యనందనా! తమ్ముఁ బోలుచు

హాత్ములే యిట్లు సెలవిచ్చిన నే నేమొనర్తును? కరుణించి గురుసంతికమునకు రమ్ము.

అశ్వ—(తలపంకించి) నేఁ బ్రాతఃకృత్యముల నిర్వర్తింప నేగె ద. మీరు పోయి రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీమత్పరదేవతాయైనమః

# విజయప్రతిజ్ఞ.

## తృతీయాంకము.

### ధర్మరాజు గుడారము.

[ధర్మరాజును, భీముఁడును బ్రవేశింతురు.]

ధర్మ—తమ్ముఁడా! భీమసేన!

ఉ. భానుఁడు గ్రుంకకుండ మనపార్థుఁడు సైంధవుఁ గూల్తునం
చుఁ దాఁ, బూనె, జనార్దనుం డతనిపూన్కికి మెచ్చి,
బహూకరించె, నెం, తేనియు సంశయాంబునిధి నీఁదుచు
నుంటి నదెట్లటంచుఁ గ, ర్మానుభవంబుఁ దాఁటఁగలయా
తఁడు లేఁడు జగత్త్రయమ్మునన్.

అయినను,

మ. వనజాక్షుండు కలండు ప్రోవఁ గలనన్ బార్థుండు బల్దిట్ట
యం, చును ధైర్యమ్మును బొందుచుంటి, ననిలో శౌర
త్వమున్ జూపి సిం, ధునృపాలుం గడతేర్ప సాయపడు
యోధుల్ నీవునుం గూడి, య, ర్జునువాక్యమ్ములమో
ఘముల్ గనఁగ నంచున్ గీర్తిఁ దెప్పింపరే.

భీము—అన్నా! ధర్మనందనా! పద్మవ్యూహమ్మునఁ బసిబా
లు నొంటిఁజేసి వీరుల మని విఱ్ఱవీఁగుమహాయోధు లంద
ఱేకమై గెడపిరి. ఇప్పు డర్జునునిప్రతిజ్ఞ విని సైన్య మంత
యు గగ్గోలువడుచున్నది.

ధర్మ—అది యెట్లు?

భీము—మహాత్మా! అర్జునుఁడు కుమారుఁ చావు వినినప్పు
డెత్తివచ్చు నని తలంచి, దుర్యోధనుఁడు సైన్యమ్ముల కు
త్సాహమ్ముఁ గల్పించుచుండ, మనప్రతిజ్ఞావచనమ్ములు
ను, సింహనాదమ్ములును విని, సైంధవచారు లాతని కె
ఱిఁగింప సైంధవుఁడు దుర్యోధనాదులకడ కఱిగి, వారల
కర్జునుప్రతిజ్ఞ నెఱింగించి, వనమ్ముల కరిగి ప్రాణరక్షణ
ముఁ జేసికొనియెద ననిన, రారాజు వాని నోదార్చి
యాచార్యున కాసమాచారం బెఱిగింప నతండు నగి—

మ. ఘనకోదండము కేల నంది నిలువన్ గంగాధరుం డైన, న
న్నని వారింపఁ దలంకు, నేఁ గలుఁగ నీ వాపార్థువాక్యమ్ము
లన్, విని భీతిన్ గన నేల? సింధునృప! నా విక్రాంతిఁ
జూపించి, ని, న్ననిఁ గాపాడఁగఁ బన్నెదన్ దురవగాహ
వ్యూహ మత్యుగ్రతన్.

అని యోదార్చె. కర్ణాదియోధవరు లాతనిఁ గాపాడఁ గృత
నిశ్చయులై యున్నారు. జనార్దనుం డాచార్యుఁ డిచ్చిన

యభయము తమ్మున కెటింగింప, నతం డాశౌరితో
నిట్లనియె.

శా. భారద్వాజుఁడు, కర్ణ సౌబల కృపాశ్వత్థామశల్యాదిస
ద్ధీరుల్ సంగరమం దెదుర్కొనఁగ భీతిం బొందఁగా నేల? నీ
కారుణ్యామృతవార్ధిఁ దేర్చి మములం గాపాడ నీవుండ, సం
హారమ్ముం బొనరింప లేనె? సురలాహా! యంచు న న్మె
చ్చఁగన్.

అదియునుం గాక,

శా. గాండీవమ్మట సాధనమ్ము, రథముల్ గంజాక్షుఁడే తో
లు, ను, ద్దండంబౌ కపికేతనమ్ము సురదత్తమ్మైనశంఖ
మ్ములున్, జెండాడఁ దగనట్టిరథ్యరథముల్ శ్రీకంఠు
నస్త్రమ్ములున్, పాండిత్యమ్మును గల్గ శాత్రవులు విధ్వం
సమ్ముఁ గాకుందురే?

కాన మమ్ముఁ గాపాడుభారమ్ము నీయది యన నామహాను
భావుండు వల్లె యనియె.

ధర్మ—తమ్ముఁడా! నీవు చెప్పినవాక్యమ్ములచే నామనమ్మున
శోకసంరంభమ్ము లొక్కుమా ఱావహించినవి.

క. బంధుగుఁడైన సింధుజనపాలుని గావఁగ రాజునాజ్ఞచే
నందఱుయోధులుం గలసి యర్జును దాఁకెద రెట్టు లంచు
నా, డాఁదముకొందలంబను, కడిందిముదమ్మున నింద్రసూను

గో, విందుఁడు బోరిపఁగాఁగలఁడు, విన్నదనమ్ము వహింప నేటికిఁ ?

భీము—ఇవ్విధమ్మగు సరసల్లాపమ్ము లాలించి బృందారకులు నివ్వెఱపడి, దీన నేమిపుట్టునో యని చింతఁ బొందిరి. అంత నాకౌరవస్కంధావారమున ననేక దుర్నిమిత్తమ్ములు పొడసూపె. నే నీయుదంతమ్ము దేవర కెఱిఁగింప వచ్చితిని.

సేవ—(ప్రవేశించి) దేవా! శ్రీకృష్ణభగవాను లనుజసహితులై చనుదెంచి యున్నారు.

ధర్మ—(ఆతురతతో) త్వరగాఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించును.)

[శ్రీకృష్ణసాత్యకులు ప్రవేశింతురు.]

ధర్మ—(లేచి యెదురేగి) మహాత్మా! కుశలమా?

కృష్ణ—మహారాజ! నీయట్టిధర్మాత్ముని నిత్యముంగనుఁగొను నాకు సేమమున కేమితక్కువ?

ధర్మ—బావలారా! మీ రీయాసనం బధిష్ఠింపుఁడు.

(అందఱును గూర్చుందురు.)

ధర్మ—ఉ. పంకజనాభ! బాల్యమున బాములుపెట్ట సుయో

నావు, మా, సంకటముల్ హరింప రథసారథి వైతివి సవ్య

పాచి కే, నింకిటఁ గోరఁదగ్గ దెది? యూశుఁడ వీవ యెఱుం
గు దన్నియుక్.

అయినను సింధురాజును వధింపఁబోవుపార్థుని రక్షింపవలయు
నని మఱొక్కసారి ప్రార్థించుచున్నాను.

కృష్ణు—యుధిష్ఠిరా! నీ కిందుల కర్జునునిగూర్చి యింతభ
యము? అర్జునుఁడు సామాన్యుఁడా?

ఉ. బంకుతనాలఁ బోవఁడని పార్థివ! నీవ యెఱుంగదయ్య, నీ
వింక భయమ్ము నొందఁ బనియేమియు లే దరిరాజశౌర్య
పుక్, జింకల నింకఁజేయు ఘనకీస్తులవీర్యమువాఁడు శీర్ష
ముల్, సుంకముఁ బెట్టితీరుదురు చోద్యముగా నృపు
లాతఁడల్గినక్.

మ. ధనురాచార్యుఁడె కా దిఁకెవ్వరయినక్ ధర్మమ్ము వోనాడి
గ్రక్కున నెక్కుమ్మడి వచ్చి దాఁకినను నీకుం బ్రీతిఁగా
వించు నీ, యనుజన్ముఁడు కిరీటి; సింధునృపు నుగ్రాకార
తంగూల్చు, లే, దనియుం దాతనికి న్భయుం బొకట ధైర్య
మ్ముందు మోధర్మజా!

ధర్మ—నాతమ్ముఁ డట్టివాఁడైనను నీవే యాతనికి బలము.
సైంధవునిఁ జంపుట దుస్తరము. వా రెన్నిమాయోపాయ
మ్ములనైనఁ బన్నుదురు. నీసహాయము లేక పార్థుఁడు గె
ల్చుట కల్ల. ఇదివఱకొవచ్చినసాయమ్మున కెంతయుఁ గృ

తజ్ఞులము. ఇప్పు డర్జునుని ప్రతిజ్ఞాభంగంబు గాకుండఁ గా
పాడవలయు నని నీపాదమ్ములం బడి ప్రార్థించుచున్నాను.

కృష్ణు—చ. ఒకకరమందుఁ బగ్గము లికొక్క-కరమ్మున దండ
మూని నేఁ, జకచక తోలుస్యందనము చక్కికి వచ్చెడువా
ర లుండ రే, నొకట సహాయ మిత్తు నరి నోర్చి ప్రతిజ్ఞను
నిర్వహించెదుర్, బ్రికటితశౌర్యధుర్యుఁ డలపార్థుఁడు నం
దియ మేల నీ కిఁకన్?

యుధిష్ఠిరా! అట్టిమహావీరునకు సారథి నౌట నాయదృష్టము
ననే కదా!

అర్జు—(ప్రవేశించి) నీయనుగ్రహమే లేకయుండిన, నీపార్థుఁ
డు నొకవీరుఁడేనా యేమి? దేవా! నీకృపయే లేకుండిన
నిన్నరాత్రి అగమ్యమ్మగుకైలాసమ్మునకుం బోయి పాశుప
తసిద్ధి నెట్లు గాంచ నేర్తును?

ధర్మ—(సంతోషముతో) ఏమి? పాశుపతసిద్ధి యైనదా? అ
ట్లైనఁ గృతార్థులమే! అది యెట్లుసంభవించినదో చెప్పు
ము. విని యానందించెదను.

అర్జు—అన్నా! ధర్మనందనా! నిన్నరాత్రి నిదురవోవుతఱి
నే నొకస్వప్నముం గాంచితిని. అది కలయో కల్లయో
నాకే సంశయము. అందు శ్రీకృష్ణుఁడు నాకడ కరుదెంచి
పార్శ్వగతుం డయి "శూలపాణియస్త్రమ్ము ప్రస్ఫుటపరిజ్ఞా
నం బైనచో నీవు తప్పక జయద్రథుని బరిమార్పఁగలవు.

అది లేనిచో ద్రోణాదియోధులతోడు నీడఁగల వానిఁ గడ తేర్చుట దుర్ఘటము. నీప్రతిజ్ఞయు సాధారణమైనది కా" దని నన్నుఁ బ్రయాణమ్ముఁ జేసి యుత్తరాభిముఖమ్ముగాఁ దీసికొని చనియెను.

ధర్మ—ప్రతిజ్ఞయొనర్చిన మన కుండవలసిన యీవిచార మీ తని కుంట మనయందలియనుగ్రహము కాని మఱియొండు కాదు. తరువాత?

అర్జు—అదేమిమాయయో కాని యొకింతన మహనీయమణి మయం బైన యొక్క మందిరమ్ముఁ గంటి, మందు—

సీ. మిఱుమిట్లు గొల్పు నబ్బురమైన కాంతిపుం
జంబు భాసిలుశరీరంబు వాని
నర్ధదేహము నందు నలరుపార్వతితోడ
సింహాసన మధివసించువానిఁ
బ్రమథులమొదఁ గనుపఱచుప్రేమను దెల్పు
చల్లనిమందహాసంబు వానిఁ
బరమర్షి గణమెల్ల భక్తితో స్తుతిఁ జేయు
చుండఁ జేకొలగం బున్నవానిఁ

తే. గీ. దపనశీతాంశువహ్ని నేత్రములవానిఁ
దపనుజడలందు గంగను దాల్చువానిఁ
జటులదందశూకముల భూషణమువానిఁ
గంటి మీశ్వరుఁ గన్నులకఱవు దీఱ.

ధర్మ—(కనులను మూసి) మహాదేవా! గిరిజామనోహరా! నీ భక్తులమగు మాయందు నీవు కృపాంతరంగుడవై యుండ మా క్లేశము లెంతయుఁ గలుగఁగూడదు. మమ్ము రక్షించు భార మంతయు నీయదియే. అర్జునా! తరువాత ?

అర్జు—అన్నా! ఏమనివిన్నవింతును. నేనువిశ్రాంతసమయమునందు శ్రీకృష్ణుని కర్పించిన గంధపుష్పాక్షతల నామహాదేవుని దేహమునందుఁ గాంచి విస్మయపడి యామహామహునందు మమ్ముఁ బ్రీత్యర్థాన మ్రొక్కుటయే యెఱుఁగనైతిని.

ధర్మ—సత్త్వగుణప్రధానుఁడైన హరియు, రజోగుణప్రధానుఁడైనశంకరుఁడును తమోగుణప్రధానుఁడైనకమలాసనుఁడును నొక్కటియే. అందుచేతనే వారికి భేదము గన్పింపక యెవ్వరినిబూజించినను మువ్వురును సంతసింతురు. తరువాత ?

కృష్ణ—(చిఱునవ్వుతోఁ దనలో) తత్త్వ మెఱింగినవాఁ డగుటచేతనే యీతనిమనం బెప్పుడును ధర్మమునందె యుండి ధర్మరాజను సార్థకనామధేయము గలిగెను.

అర్జు—తరువాత శ్రీకృష్ణభగవానునియాజ్ఞచే నేఁ బాశుపతసిద్ధిం గోరుటయు, నాభక్తవత్సలుం డగుశంకరుఁడు నాకొక కాసారమ్ముఁ జూపి, యందున్న బాణబాణాసనమ్ములఁ దేర నియోగించుటయు, నే నచట కరిగి—

తే. గీ. అమృతమయమగు నల్లపర్మాకరమున
విషము గ్రక్కుచు నెంతయు భీతిఁగొల్ప
సర్పముల రెంటిఁ గాంచి యాశ్చర్య మంది
యదియ సత్త్రంపుమహిమయే యని తలంచి.

పాదప్రక్షాళనమ్ముఁ గావించి శుచినై, పాముల కుపస్థానమ్ముఁ జేసి ప్రార్థించిన నయ్యవి విల్లమ్ము లాయె. అయ్యవి కైకొని వచ్చి విషకంధరుమ్రోల నిడితి. అంత నొకబ్రహ్మచారి విగ్రహము నారిఁ గూర్చి, బాణమ్ములు సంధించుచుండ నే నయ్యది తిలకించుచుండ మహాదేవుఁ డనుగ్రహించి మంత్ర మ్ముపదేశించె.

భీము—(ఆశ్చర్యముతో) ఆహా! పురహరుని వాత్సల్యము. ఇంతనుక సైంధవువధనుగూర్చి సంశయించితిని గాని నా మనస్తాపమ్ము తీఱినది. తరువాత?

అర్జు—తరువాత నాబాణబాణాసనమ్ముల యథాస్థానమ్మున నిడి వచ్చి మున్నొసఁగినవరము నివేదింప మహేశ్వరుఁడు సాంగముగాఁ బాశుపతసిద్ధి యొసఁగె. నిద్రయు మెలకువ వచ్చె. నిజముగా నాకుఁ బాశుపతసిద్ధి యగుటవలన న య్యది కల యని దలంపఁ జాల.

భీము—(అంజలిఘటించి) వాసుదేవా! మహానుభావా! నీ యనుగ్రహమ్ము లేనిచో మాదృశుల కిది యెట్లు సిద్ధించును?

ధర్మ—నిజము. ఇదంతయు వాసుదేవుని కరుణాప్రభావమే. లేకున్న నింతలో నిట్లు జరుగునా? ధన్యుల మైతిమి.

కృష్ణ—దాని కేమిలెండు. అది పరమేశ్వరానుగ్రహము. కాలహరణ మెందులకు? (వినుట నభినయించి) అవిగో కౌరవ సింహనాదమ్ములు వినఁబడుచున్నవి. అర్జునా! రణరంగమ్మున కవతరింతము. అగ్రజానుజ్ఞఁగొనుము.

అర్జు—(ధర్మజుని పాదమ్ముల కెఱఁగి) అన్నా! నమస్కారము. సెల వొసంగినఁ బోయివచ్చెదను.

ధర్మ—(లేవఁదీసి కౌఁగిలించుకొని) తమ్ముఁడా! ఫల్గునా!

తే. గీ. సఖుఁడు దైవమ్ము చుట్టమ్ము సరసిజాక్షుఁ
డెపుడు నీపాల వసియింప నింక నీదు
ప్రతిన నెఱవేఱకుండునే? భండనమున
జయము కల్గెడు నీకు నిశ్చయము విజయ!

కృష్ణ—బావా! యుధిష్ఠిరా! పోయివచ్చెదము. నీవును సన్నద్ధుండవై మనభీమాదియోధులకు సహాయుండవై యుద్ధభూమి కరుదెమ్ము.

ధర్మ—అట్లే యొనర్చెదను. అర్జునా! నీదేవదత్తారావ మనుక్షణము నావీనులవిం దొనరించుచుండవలయును జుమా! ఏమఱకుము. (భీమునితో నిష్క్రమించును.)

అర్జు—తమయాజ్ఞానువర్తి నయ్యెదను. సాత్యకీ!

మ. ధనురాచార్యుఁడు పంతమూనుచు సదా ధర్మాత్ము నా
యగ్రజుఁ, దుది బంధించెద నంచుఁ బ్రీతిఁ గురునాథుం
జూచి పల్కెం గదం, గాన నింతింతలు దానిమూలమునఁ
జేకూరెం గదా నీ వెఱుంగని దేమున్నది? ధర్మనందను
నిఁకం గాపాడఁగా నుండుమా.

చ. సమయమువచ్చినప్పు డిఁక శస్త్రగురుండు యమాత్మ
జాతునిఁ, విమలునిఁ బట్టఁ జూచు, నతివిద్విషవృత్తినిఁ
బూను ద్రోణుని, క్రమము నెఱుర్పలేఁడు మనరాజు సహా
య మవశ్యమై చనఁ, సుసుతుఁడ! నీవ బ్రోవఁ దగు
నూఁకుఁడ వంచు నెఱింగి కోరితిన్.

కృష్ణు—తమ్ముఁడా! నిజము. నిజము. ధర్మరాజును గాపా
డుకొనుట యొకయెత్తును, సింధురాజుం జంపుటింకొక
యెత్తును నై యున్నవి. (జనాంతికము) పాండవసైన్యముం
దర్జునునితర్వాత నిన్నుఁ బోలినవీరుం గానము. నీవున్న
యెడ ధర్మజుఁ డర్జునుఁ డున్నయట్లు సంతసించును; కాన
ధర్మరాజుం గాపాడుచుండుము.

సాత్య—చిత్త మట్లే యొనర్చెదను. (నిష్క్రమించును.)

(కృష్ణార్జునులు ముందుకు రాఁగా వెనుక తెరపడును.)

కృష్ణు—అర్జునా! చూచితివా! కౌరవవాహిని యెట్టి వ్యూ-
హాకారమ్మున నేర్పడియున్నదో?

అర్జు—(పరికించి) చూసాను. మొదట నొకశకటవ్యూహమ్ము.

ను, దానికిఁ బశ్చిమార్ధమ్మున గర్భవ్యూహమ్ముగాఁ బద్మ
వ్యూహమ్మును, దన్మధ్యమ్ము మొదలుకొని సేనాముఖ
మ్మువెనకకుం జాలి నిగుడునట్లుగా సూచీవ్యూహమ్మును,
గన్పట్టుచున్నయవి. వాసుదేవా ! శకటవ్యూహ ముఖ
మ్మున గురుండు నిల్చియున్నాఁడు. చూచితివా ?

ఉ. అల్లదిగో కనుంగొను మహాస్ఫూర్తిఁ దాఁకెను వేదికాధ్వజం
బల్లదె సాంధ్యరాగవిమలాకృతి నందెను వారువమ్ములున్
దెల్లనివాఁగతో మిగులఁ దేజమునన్ శ్రితవర్ణ మొప్పఁగా
నల్లదె ద్రోణుఁ డగ్నివి మహాధనువుం గొనెఁ గాలరుద్రుఁడై.

కృష్ణ— అర్జునా ! సూచీమధ్యస్థానమ్మువైపునకుం దృష్టి
నిగుడ్పుము.

చ. కురుధరణీవిభుండు రణకోవిదు లందఱుఁ దన్నుఁ గొల్వఁగా
వరు దగునట్టిశౌర్య మలరారెడుపోలిక నొప్పుచుండె, నీ
వఱకును బార్థుఁ డాహవమువంకకుఁ జేరఁ డిదేమియంచు
భూవరుఁడు తలంపఁబోలు నదె వానిముఖమ్మును జూడు
మర్జునా!

(కురుసైన్యమువంకఁ దిరిగి నిందాగర్భముగా)

ఓయీ ! కౌరవేశ్వరా ! తొందరపడెద వేల ? అర్జునుఁడు వ
చ్చుచున్నాఁడు. అవశ్యము వినోదకవిక లన్నియు నడం
గును.

అర్జు—కృష్ణా ! అయ్యదియే సూచీముఖమ్మనఁ గృతవర్మా
దు లుండిరి. కాని సైంధవుఁ డెచ్చటను గాన్పింపఁ డేమి?

కృష్ణు—అర్జునా ! ఎంతవెఱ్ఱివాఁడవు. వానిని నీవు వధింపఁ
బ్రతినం బూన నీయెదుట నేల పెట్టుదురు?

చ. కనుఁగొనుమయ్య ! యుగ్గ్రరముఁ గంటివె? దానికి వెన్క
మూఁడు యోజనములదూరమందుఁ గురుసైన్యముజాడలఁ
జూడవచ్చు, నెమ్మనమున సైంధవుం డచటమధ్యగతుం
డయియుండునంచుఁ దోఁచు నరుఁడ! జాగుసేయ కలశూ
రులు వేచిరి నీమరాకకై.

(చేచాయఁ జూపుచు) నాచేచాయం దిలకింపుము. మనసైన్య
ము మనరాక కువ్విళ్ళూరుచున్నది. త్వరగాఁ బోదము
రమ్ము (నిష్క్రమింతురు.)

[అంత ధనుష్పాణియై ద్రోణుఁడు ప్రవేశించును.]

ద్రోణు—ఆహా ! దైవమా ! నేఁ బ్రాణంబు ప్రాణంబుగా
మన్నించుపాండవులపైఁ గత్తిఁగట్టఁ జేసితి వేల? మనమునం
దిష్టము లేకపోయినను దుర్యోధనునియొద్ద నునికిం జేసి
కదా నాప్రియశిష్యుం డగు నర్జునుని దాఁకవలసివచ్చినది!
(మెచ్చుకొనుచు) ఆహా ! ఏమి యీపార్థుని విక్రమము.

ఉ. హాసము వచ్చునంచుఁ దనమోమున వెల్వెలఁబోవ సైన్య
మా, వాసవపుత్త్రభీకర మవారితశౌర్యముఁ జూచి జంకె,
నుల్లాసము డిందియుండెఁ బదిలమ్ముగ నొక్కఁడ కాఁగ

నెంచెఁ, జే,ర్వాసికి నెక్కియున్న నలపార్థు నెదిర్చెడువార లుందురే ?

దుర్మర్షణుండాతని నెదిర్చి పాఱిపోయెను. సైన్యమంతయు నల్ల కల్లోల మయ్యె. ప్రగల్భములుపలుకుచు దుశ్శాసనుఁ డడ్డు పడెను కాని, విముఖుఁ డయ్యె. సైంధవుపై మనస్సునిల్పి పార్థుఁడు నే నిచ్చుటనుండుటఁ గాంచి, నమస్కరించెను. (శరీరము పులకల నటించి) ఆహా ! ఏమి యాతనివిన యము !

శా. "దేవా ! నిన్ను భజింతు నెల్లపుడు భక్తిన్ నీరణప్రౌఢిమం
బేవార ల్వెదళింపఁజాలుదురు? నేనేకాదు రుద్రుం డనిన్
భావంబం దెదిరింపఁజాలఁడు, వధింపం బోయెదన్ సైంధవు
న్నీవొక్కించుక దారి నీయఁగదవే నిర్ణిద్రశౌర్యాంచితా!

అని యాతఁడు ప్రార్థించెను. కాని నే నాతని నిలువరించితిని. సైంధవునిం గాపాడెద నని మాట నిచ్చుటచే నాతనికి దారి నీయలేకపోయితిని. (సంతోషముతో) ఆహా! శిష్యుఁ డన నర్జునుఁడే శిష్యుఁడు. ఏమి యాతనిగురుభక్తి !

మ. తను నే నేయక నన్ను నేయఁగ మదిం దల్పండు మున్ముం
దు న్నగ్గని మోదమ్మును బొందు, నట్టినరు దుష్కాలమ్ము
నం జేసి నే, ననుకంప న్విడనాడి, దుర్మతికి లోనైయుంట
చేఁ గాదె, వానిని సంగ్రామమునం దెదుర్కొనఁగ నేనే
సిద్ధనై యుండుటల్ ?

కొంతసేపు నాతోఁ బోరి పోరి, విసిగి వేసారుట నవలో
కించి, భక్తవత్సలుఁ డగుకృష్ణుండు తేరు నాకుఁ బ్రద
క్షిణముగాఁ బోనిచ్చునెపమ్మున శకటవ్యూహమ్మునఁ
జొనిపె.

చ. నిలు నిలు మాఁగు మాఁగు మిటు నీచపుఁ గార్యముఁ జే
యఁ జెల్లునే, కల దొకో? వీరు లిట్లు కనఁగా రిపుకోటి
రణమ్ము వీడి వి,చ్చలవిడిఁ బోవు టొందయినఁ; జయ్యనఁ
బాఱుట శౌర్యమే? ననుం, దలఁపడి గెల్చి పోవుము; పృ
థాతనయా! యికఁ దేరుఁ ద్రిప్పుమా.

అనుచు నెన్నంటితిని. అర్జునుండును, నాయందలిప్రేమఁ
దలంచి నాప్రతిజ్ఞ నిర్వహించుకొననీయుఁ డని ప్రార్థిం
చుచు వ్యూహమ్మునఁ జొచ్చె. దారియందుఁ గేకయాదు
లతనిం దలపడిరి. ఎవ్వ రడ్డుపడినను, సామజమ్ము తటా
కమ్ముఁ జొచ్చినరీతి, మొగ్గరము భేదించుచుఁ, బోవుచుం
డ వానిం దలపడితిని. అర్జునుఁడు నిశితనారాచమ్ముల
నన్ను నొప్పించె. నే నిరువదియైదుమార్గణమ్ములఁ గృ
ష్ణుని నొప్పింప, నాధాక కాఁగంజాలక రథంబు కృతవర్మ
సైన్యమ్మునం జొనిపె. నేఁ జేయునది లేక మొగ్గరముఖముం
గాపాడుకొన వచ్చితిని. వీరధర్మమును వీటఁబుచ్చి యర్
జునుం డట్లుకుగ నేల? (యోజించి) పాప మతఁ డేమి
చేయును?

మ. అతఁడే కాదెవరేగుఁ దెంచినను నీయాచార్యు గెల్వంగలే
రతిభక్తిం బ్రణమిల్లి దారి తన కీయం గోరె నాతండు, పె
న్వాతలం బెట్టఁగ నేను సిద్ధమయితిన్ వేవే కృప న్వీడి, యే
గతి నోర్వంగలవాఁ డుమద్వితతదోర్గర్వమ్ముఁ బార్థుం డహా!

అదియునుం గాక,

ఉ. పట్టినపట్టు దుస్తరము భానుఁడు గ్రుంకకమున్న సైంధవున్
బట్టి వధింపఁగావలయుఁ, బంతమునన్ గురుఁ డడ్డమయ్యె;
యే, తట్టునఁగూడ శాత్రవులు తామరతంపరలై చెలంగి, రీ
పట్టున మార్గ మింకొకటి పాపము! పార్థున కేది కల్గెడిన్?

(దిశలం బరికించి) దుర్యోధనుఁడు కాఁబోలుఁ గోపాకులితమా
నసుఁడై యిట్లరుదెంచుచున్నాఁడు.

సుయో—(ప్రవేశించి కోపముతో) పెద్ద లని నమ్మి గోము
ఖవ్యాఘ్రులంబ వగు నీకు సైన్యాధిపత్యం బొసంగినఫల
మనుభవించుచుంటిని.

ఉ. పాండవపక్షపాతియు నవధ్యుఁ బ్రియుం డని నే నెఱుంగుదున్
భండనమందు నీకు వలపార్థుఁడు లెక్కయె? కాక యా
తండున్, బుడితుఁడే? దయం జూపి వానికి మార్గము ని
చ్చినాఁడవే, దండుగ గాక, కార్ముకముఁ దాల్పఁగ నేటికి
నీవు పాఁడగా!

సీ. యర్జునుని మొగ్గరమ్ముఁ జొరనిచ్చుటచేఁగదా శ్రుతాయుధ
ప్రముఖమహారథు లందఱు మడిసిరి? అదియునుంగాక,

మ. అని రక్షించెద వంచు నెంచితివొ కదా యాచార్య! నాబా
వ న్నెమ్మనమందుఁ దనసేన మెంచి రణసీమం జొచ్చె తే
కున్న నే,వనమందో, మఱియొంకచోటనో వసింపఁ
బోద్దు పోదే? వినుఁ, ఘనుఁ డంచెంచ మరందలిప్త మ
గు ఖడ్గంబై తివే భూసురా?

ద్రోణ:—(కోపముతో) ఓయీ! దుర్యోధనా! ఏల నోటికి వచ్చినట్లెల్ల దూషించెదవు? బ్రాహ్మణుండను, వృద్ధుండను నగు నే నేమి సేయఁగలుగుదును?

తే. గీ. నీమరెండవప్రాణమ్ము నీసఖుండు
కర్ణుఁడును నీవు సైంధవుఁ గాచుకొనుఁడు
వినుము గ్రక్కుడుపాములఁ బెంచ నేల?
యిచ్చవచ్చినరీతిఁ జేయించుకొనుము.

(వెడలిపోఁబోవును.)

సుయో:—(పాదములఁబడి) దేవా! మీ రిట్లాగ్రహించుట ధర్మమా?

తే. గీ. ఆర్తిలో మున్గితిని గాన నట్టు లంటి
నాదుతప్పుల క్షమియించి నన్నుఁ గావు
మయ్య! అల ధనంజయుఁ జూచి యడలుచుండు
సైన్యమును గావఁగదవయ్య సద్గురుండ!

ద్రోణు:—(మందహాసముతో) దుర్యోధనా! సర్వమెఱింగియు నన్ను దూషించెద వేల? వెన్నిచ్చిపోవుచుండిన పార్థు

నెంతవఱకు వెన్నంటుదును. ముగ్గరముఖమ్మున నే లేని
యెడల( బాండవబలంబు మనవారల( జించి చెండాడుదురు.
అదియునుంగాక, ధర్మజుని( బట్టియిచ్చెద నన్నప్రతిజ్ఞ మ
ఱవరానిదై యున్నది. కాన నే నొకహితోపదేశ మ్మొన
ర్చెద, నట్లొనర్పుము.

ఉ. నీవును బార్థు(డు౯ యువలె, నిస్తులవీర్యము గల్గువారలే
కావున, నాతని౯ గడిసి కౌరవనాథ యదల్పుమయ్య! నీ
చేవనుజూపి కీర్తిరమ( జెందఁగ యత్నము(జేయుమయ్య!
యీ, భూవరులందఱు౯ భయము పూర్తిగ వీడఁగ భూ
వరోత్తమా!

సుయో — ఆచార్యా! ఏల దీనావస్థ బొందియున్న నాతో(
బరిహాసనములు ?

ఉ. లోకములన్నియు౯ గడియలోపల గెల్వఁగ( జాలునట్టివా(
డేకడ కేగిన౯ జయము లిమ్ముగ( బొందెడువాఁడు, శా
త్రివా, నీకము వాని నోర్చుటకు నేరదు; దుర్జయు(; డట్టి
పార్థు న్నేవీక నెదుర్ప( జాలుదును; భీరు(డ నంచును గేలి
సేయుదే ?

ద్రోణు — సుయోధనా ! నే( బరిహాసమున ననుట లేదు. నీ
వనినట్లు పార్థుం డట్టివాఁడే యగును. కాని నే నుపాయ
ము చెప్పుచుండ నీకు భయ మేల ?

సుయో — మహాత్మా ! క్షమింపవలయును. మానసము వ్యా

లాందోళన మంది పరిహసించితి రని దురభిప్రాయపడి
తిని అయినను,

క. నీవు విధించుచో గురుఁడ! నీపదపద్మములాన సుమ్ము నేఁ
బోవఁగనుంటి నేపనికిఁ బుచ్చిన, నందియు మింత లేదు; నేఁ
జేవమజూపి సంగరముఁ జేయుదు నోయనఘుండ! కాని,
యీ, భూవరుఁ డోడె నన్ననడిఁ, బొందక యుండెడునట్లు
చేయుమా!

ద్రోణు — దుర్యోధనా! నే నొకయద్భుతమాహాత్మ్యముచే
ననంగు కవచం బొసంగెదను. అది ధరించినచో విశిఖ
మ్ము లేమియుం జేయఁజాలవు. ఆకవచమ్ము ధరియించి
నీ వీనాఁడు రణమ్మున నిశ్శంకం దిరుగుము. ర మ్మొసం
గెదను.

సుయో — మహాప్రసాదము. అర్జునుని మొగ్గరమ్ముఁ జొఱ
నిచ్చితి రని మిమ్మనరానిమాటలంటిని. అవన్నియు మ
ఱచి దయాంతఃకరణమ్మున నన్ను మన్నింపవలయును.
మీ కివే పదివేల వందనములు.

ద్రోణు — సుయోధనా! మేము బ్రాహ్మణులము. మాకు
దీక్షకోపంబు సనదు. నీయభీష్టానుసారంబున వర్తింపక
నే నెందుఁ బోవుదును! రమ్ము కవచ మ్మొసంగెద.

సుయో — చిత్తము. అనుగ్రహింపఁబడితిని.

(ఇద్దఱును నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# విజయప్రతిజ్ఞ.



## చతుర్థాంకము.

### యుద్ధభూమి.

[కృష్ణార్జునులు ప్రవేశింతురు]

కృష్ణు — అర్జునా! నీవిలువిద్యానైపుణికి సంతసించితిని.

మ. వరదివ్యాస్త్రములచే వసుంధరను నెవ్వారైన భేదించి
భూ, వరు లాశ్చర్యముగ నొందఁ దోయమును సంపాదించి,
సంగ్రామమం,దు రయం బొప్పఁగ శత్రుభూవరులకున్
దుర్భేద్యమౌ బాణపం, జరముం గట్టి తురంగమంబులకి
టన్ సంతాపముం బాపునే?

తురంగములు నీరమ్ముఁ ద్రావినయనంతర మ్మొక్కించుక వి
శ్రమించితిని. అంతదనుక, నీవు మహాయోధుఁడ వగుటచే
నీధనుర్విద్యానైపుణిం జూపి, నన్నును, యశ్వమ్ములను గా
పాడుచు, శత్రుసైన్యమ్ములఁ జీకాకు నొందించితివి.

అర్జు—బావా! మహానుభావ! ఇదంతయు నీకృపావిశేషమ్మే గాని నాప్రజ్ఞ కాదు. వృథాస్తోత్రపాఠములచే నన్ను సిగ్గుఁబఱుపకుము.

మ. ధరణీచక్రము సంచలించుఁ జుమి నీదాక్షిణ్యసంపాదకుల్
శరజాలమ్ములఁ జొన్పుచుండి యరులన్ శౌర్యమ్ముమైఁ
దున్ముచుచో, నరవిందాక్షుఁడ నీవు గల్గ భువి నాయశ్వ
మ్ము లేమాను; భూ, వగులెల్లం గుమిఁగూడి వచ్చినఁ
గృపాపారీణ! నే నాఁపెదన్.

కృష్ణు—నాయందు నీకుఁ గలభక్తిచే నట్లనుచుంటివే కాని, నీ వొకరిసహాయ మిసుమంతయుఁ గోరవు. నేఁడు విందానువిందులతోఁ బోరునప్పుడే నీపరాక్రమ మెఱింగితిని.

అర్జు—బావా! నీతో నొక్కవిషయము ముచ్చటింప మఱచితిని. నేను విందానువిందులతో సమరమొనర్చునపు డాచార్యు లున్నవైపునఁ గొరవసింహనాదమ్ము లొక్కుమ్మడి వెలువడినవి. కారణం బేమి ?

కృష్ణు—ఆసింహనాదంబు లుభయబలంబు లొనర్చినవి కాని యొక్కరివి కావు.

అర్జు—(ఆశ్చర్యముతో) ఉభయసైన్యము లొక్కసారిగ సింహనాదము లొనర్చుటకు మహత్తరమైనకారణ ముండ నోపును.

కృష్ణు—అర్జునా! సావధానుఁడవై యాకర్ణింపుము. ద్రోణ

దృష్టద్యుమ్నులును, చిత్రసేనభీమసేనులును, దుశ్శా
సనసాత్యకులును, శకునినకులసహదేవులును, అలంబస
ఘటోత్కచులును, నొండొరులం దలపడి శరాసారమ్ముల
ముంచుకొనుచున్నడ, ద్రోణుండు కుపితుండై, దృష్టద్యు
మ్నునిపై నొకదొడ్డనారాచం బేయ, దుశ్శాసనునితో
యుద్ధం బొనర్చుచున్నసాత్యకి, పార్థుని కడ్డుపడి,
దానిని దుత్తునియలు గావించెను.

అర్జు—బళే! సాత్యకీ! మంచిపని చేసితివి. తరువాత?

కృష్ణు—ఉ. కోపము తాపముం గదుర, కుంభజసాత్యకు
లొండొరుల్ మహా, చాపములన్ ధరించి పటుసాయక
ముల్ బరఁగింపుచుండఁగా, బావనిచాపముం దునిమెఁ
బాండవమధ్యమ ! నీదుశిష్యుఁ డుద్దీపితశౌర్యధుర్యుఁ
డయి దేవత లెల్లరుఁ దన్ను మెచ్చఁగన్.

ఇట్లు ద్రోణుండు నిరాయుధుండై

ఉ. వేఱొకచాప మెత్తి శినివీరుని మార్గణ, నాతఁ డంత
బల్, నారసమున్ గ్రహించి నుసుమన్, మఱి వేఱొక వి
ల్లు నెత్తె, దు, ర్వారబలుండు సాత్యకియు వారక దానిని
గూడఁ ద్రుంచె, నీ, తీరున నాతఁ డెత్తుటయు దీప్తశరం
బులఁ ద్రుంచె నీతఁడున్.

కం. ఎత్తిన చాపము లన్నియుఁ
దత్తునియలు గాఁగ నేసె, దోర్బలమున న

త్యుత్తముఁ డని ద్రోణుఁడే
చిత్తమునఁ సంతసించి శినిసుతు మెచ్చెన్.

అర్జు—(ఆశ్చర్యముతో) ఆహా! ఏమి మన శైనేయుని విలు విద్యాపాటవము!

కృష్ణ—అర్జునా! ఆశ్చర్య మొంద నేల? అతం డెవరు? నీ శిష్యుఁడే కదా!

అర్జు—దేవా! తరువాతసంగతి వినుటకు నామానసము తొందర నొందుచున్నది.

కృష్ణ—అర్జునా! అట్లైన వినుము.

శా. శైనేయుం డటు శౌర్యధైర్యములు నుత్సాహమ్ము దీపింపఁగా, నానాస్త్రమ్ములఁ జాపముల్ విఱువ, ద్రోణాచార్యుఁ డత్యుగ్రుఁడై, భూనాథుల్ గన సాత్యకిన్ రణమునం బూర్ణాహుతిం జేయఁగా, లోనం జింతిలి బాణ మేయ, నతఁ డాలో నేసె నాచార్యునిన్.

ఇట్లిరువురిచే విసువంబడిన—

తే. గీ. బాణములు రెండు నంబరపథమునందుఁ
జాలవఱకును బోరె నాశ్చర్య మొప్ప
నొకటి వేఱొకదానిని నోర్వలేక
సురిగి విఱిగెను జూపరుల్ చోద్య మంద.

అందుచే నుభయబలమ్ములొక్కసారి సింహనాదమ్ములు గావించినవి.

అర్జు—ఆహా! సాత్యకీ! ఎంతవింత కార్య మొనర్చితివి. నా
 కంటెను నీవు గురుభక్తిఁ గలవాఁడవు ఏమన?

తే. గీ. గౌరవము సేయఁ దగుగురుఁ గాదటంచు
 సంగరముఁ జేయ మదియందు సాహసింతు
 . గురునిగౌరవమును నిల్పఁ గోరి రణము
 గురుని గురునితో సేయంగఁ గోరినావె?

అకటా! గురునితో గుద్దులాడు టుచితమా? ఏమి చేయు
 దును!

ఉ. పాపి సుయోధనుండు మనభాగపురాజ్యము నీయకుండఁ
 గన్, బాపఁదలంచి సంగరముఁ బన్న, మహాత్ములు వాని
 వీటిలోఁ, గాఁపుర ముంటచే నతనిఁ గావఁగ నెంచి తదీయ
 పక్షమై, మాపయి నెత్తివచ్చి రిది మాదుపురాకృత మెల్ల
 భంగులన్.

కృష్ణు—అర్జునా! ఏల నీ కీవెఱ్ఱి?

చ. కదనముసేయుపట్లఁ దలఁకం బని లేదని చెప్పియుంటి నీ,
 వది మదియందుఁ జేర్ప కిటు లక్కట! వారలు వీర లంచుఁ
 జూ, చెద విది వీరధర్మ మొకో? చేతికిఁ జిక్కినవారి నెల్ల
 వేఁ, జటుపును! నీవె యిట్లు యిన జన్య మెటుల్ తుదనెగ్గు
 నర్జునా!

అర్జు—వాసుదేవా! (అర్ధోక్తియందు)

కృష్ణు—అర్జునా! అదె నీపుత్త్రఘాతి యగు సింధురాజు.

అర్జు—(రభసముతో) ఏఁడి! ఏఁడి! సైంధవుఁడు—(నలు దిక్కులఁ జూచును.)

కృష్ణు—(తేటిపాటుఁ జూచి) సింధురాజు కాఁడు. దుర్యోధనుఁడు.

చ. కనులను విస్ఫులింగములు గాఢతరమ్ముగ రాల, ఘోర రూపును గవచమ్ముఁ దాల్చి, కురుభూపతి యీదెస నుండి రాదొడంగెను గనుఁగొమ్ము పార్థ! పరఁగింపుము బాణపరంపరల్ వడిన్, దనువున గ్రుచ్చి, యీతనిమదం బణఁగింపు నిమేషమాత్రిలో.

సుయో—(ప్రవేశించి కోపముతో)

శా. ఏరా! పాండవమధ్యమా! సమరమం దీరీతిగాఁ దద్దయుం, గ్రూరత్వమ్మున మొగ్గరమ్ముఁ జొరితే ద్రోణుండు వీడంగ; నీ, ధీరత్వం బిట సాఁగిరాదు తన కంతేవాసివౌ నిన్నుఁ దా, శూరుం డయ్యు గురుండు వీడెను గతాసుం జేయ నేఁ జాలనే?

ఇదివఱలో నే నేమఱియుండ నీవు జయమ్మం గాంచితివి. నేఁ డటుల గాదు. నీమాటలు సాఁగవు.

అర్జు—ఓరీ! కౌరవజఘన్య! నేఁడు నీ కేమైనను నూతన శృంగము లుద్భవించినవా?

మ. చన దుర్యోధన! నీదుసైన్యము రణోత్సాహమ్ముఁ జాలించి యా, ఘనమాగాలికిఁ బాయులై పఱఁగుమేఘవ్రాత

మన్నట్లుగా, వనముం గాల్చు హుతాశనుం దనివిగ దర్పం జేర్పడం గప్పెదర్, ఘననారాచపరంపరాహుతుల వీ కేర్ నిన్ను నీసేనలన్.

సుయో—ఓరీ! కౌంతేయ! నీవ్రగల్భము లింతతోఁ గట్టి పెట్టుము. నీపరాక్రమము తాతతోఁ బోరునప్పుడే తెల్ల మాయెను.

ఉ. ముందు శిఖండి నుంచియె ప్రమోదము నొందుచు వెన్క నుండి నీ, పందతనంబు బైటఁబడ బాణము వీడి మహా త్ము భీష్మునిన్, మ్రిందఁగఁ జేసినావు సమరమ్మున, య ట్టిదు నిన్నుఁగూండ నే, చందమునన్ గణింపఁ దగు శౌర్య సమన్వితుఁ గాఁగ మూర్ఖుఁడా

కృష్ణ—సుయోధనా! మీ రొనర్చినదుండగమ్ములలో నిది యెన్నవవంతును గాదు. అర్జునుని పందతనమ్ము నీవు నేఁ డెఱింగితివి కాని, నీపందతనము మేము చిరకాలమునుండి యు నెఱుంగుదుము. అర్జునా!

ఉ. మున్నల జూదమందుఁ గురుముఖ్యులు చూడఁగ ధర్మజా తుఁ డా, పన్నత నొందఁగా ద్రుపదుపట్టికిఁ బుట్టము లొల్వఁ జేసె, నీ, చిన్నికుమారుఁ గూల్పఁ దగు చేవ రవంతయు లేక మాయలం, బన్నినదుర్మదాంధుఁ గెడపం దగు వీని నిమేషమాత్రిలో.

అనియుండఁగాక,

తే. గీ. సింధురాజును బలముగాఁ జేసి వేగ
నాహవం బఖుజూదమ్ము నాడఁ దగును
కురువిభుఁ డను, నీవును; కుంభజుండు
సేను మామధ్య ధర్మమ్ము దేర్పరింప.

కానఁ దద్ద్యూతమ్మున సుయోధను నోడించితి వేని,

తే. గీ. సమర మనుజూదమున రాజు చావు సరసి
యొక్క క్షణమున సైన్యమ్ము లూహదక్క
నాల్గువైపుల కొడుగు నన్యాయ మనుచుఁ
జూడఁ బోకు, బాణాక్షముల్ వీడుమయ్య!

సుయో—కృష్ణా! నీ శస్త్రమ్ముఁ గలపాండవుల కన్యాయ
మ్ము గాక న్యాయ మెచ్చటిది?

ఉ. పాలను దా(గి)వి, పూతకినిఁ బట్టి వధించినదుండగీడ! గో-
పాలుఁడ! పార్థు తేరు గడపం జను దెంచియు నాయుధ
మ్ము నే, నాలమునన్ ధరింప నని న్యాయము వీడి ధరించి
భీష్మునిం, గూలుప నెంచినాఁడవు సఖుల్ గద వీరలు
నీకు దుర్మతీ!

అర్జు—బావా! వాసుదేవ! ఈ మరాత్ముఁడు నోరికివచ్చి
నట్లెల్లఁ బ్రేలుచున్నాఁడు.

ఉ. ద్రౌపదినిట్ల దురాత్మకుఁ డుదగ్రతఁ బెట్టిన బాము లెల్ల
నం, తాపము నొందఁజేయవె? యథార్థము కోపముఁ
బెంపవే? మహాపాపి యితండు వీనిఁ గనఁ బాపము రా

దౌరా ? వీనిప్రాణముల్ బాపి యశంబుఁ గొందు నీక
వారిజనాథ ! రథమ్ముఁ బూన్పుమా.

కృష్ణు—అర్జునా ! అట్లే చేయుదును.

(పరిక్రమింప యత్నింతురు.)

[తెరలో]

ఓహో ! కౌరవచమూపతులారా !

ఉ. రాజు సుయోధనుం డట దురంబునఁ బార్థునిఁ దాఁకు
చుండె, వే, వే జనపాలుఁ గావఁ దగు వీరులు నందఱు నేగి;
లేనిచో, రాజును గావ నర్థ మరాజక మౌ మనసేన
నేఁడు; కాం, భోజనృపాల! సేనఁగొని భూపునిఁ గావఁగఁ
బొమ్ము వేగమే.

సుయో—ఓ కౌరవచమూపతులార ! ఓకుంభపౌత్ర !

ఉ. భీతిఁ గనంగ నేల? పటుభీకరభల్ల ముకందు గ్రిచ్చి, యా
నాతిని జంపినట్టిడు, జనార్దను గూల్చెద, వేలోకమ్మునన్
దాతనుగూల్చి పేరుగను ధర్మజుతమ్ముని గూలనేసి నే,
నీతటి సంతసమ్ము వహియించెదఁ జూడుఁడు నాప్రతా
పమున్.

(అర్జునునివైపు తిరిగి) ఓరోరి ! పాణుఁబోత ! అర్జునా !

చ. జగములనన్నిటిని గెలువఁ జాలినవీరుఁడ వంచు నిన్నుఁ
జేర్చిఁ గనఁగఁ జాటుచుందు రిది మేలని మెచ్చి బహూక
రించు నో,వగతుఁడ ! కృష్ణుఁ డల్లపు, డబద్ధము పౌరుష

ముంట నీకు, నీమగటిమి నీకు సేతు నను మార్కొను
మీావు రణాంగణంబునన్.

రమ్మ. (నిష్క్రమించును.)

కృష్ణ—పార్థా! వింటివా వీని మదాలాపములు?

అర్జు—వింటిని.

మ. అతిగర్వోద్ధతుఁ డౌచుఁ దిగ్గుచు నరణ్యంబందు శూరుం
డె? దీనతి గంధర్వులచేతఁ జిక్కి కడుబన్నం బందె; సంత
ప్తుఁడై, పతి నన్నంపఁగ వీనిప్రాణములఁ గావం బోతి
నానాఁడు, వీ, నితరంబే దురమం దెమర్కొనఁగఁ, గాని
మ్మిప్డె శిక్షించెదన్.

(బాణప్రయోగము నటించును.)

అర్జు—(నొచ్చుట నటించి యాశ్చర్యముతో) ఇదేమివింత?
నాయస్త్రంబు లాసుయోధనునియందు నిష్ఫలంబు లగు
చున్నవె!

ఉ. ఇమ్మెయి సర్వసాధనము లేసితి నొక్కటియైన వానిదే
హమ్మునఁ జొఱంగ లేదు; నతఁ డశ్వములన్ నను గాడ
నేసెఁ, దేజమ్మున సర్వలోకగురు శంకరు నోర్చినవాఁడ;
నాదుబా, ణమ్ములు వమ్ములయ్యెఁ గురునాథు నెడన్; గత
మెద్దియో? కదా?

ఆశ్చర్యముగా నున్నదే?

శా. నాశమ్ము లభ్రిమఁ జెందెనో, నిజముగా నారాచముల్
వ్యర్థమై, తాఁకం జొచ్చెనో వానిదేహమున, నాదర్పమ్ము
వమ్మయ్యెనో, లేకన్ శేదిటువంటిదిం, నిఁక నేలీలన్
దురంబుదు దు, ర్దికున్ గెల్చెద నంచు సంశయము బా
ధింపంగఁ జొచ్చెన్ హరీ!

కృష్ణు—(ఆలోచించి) అర్జునా! ఇది దుర్యోధనుని శక్తి కా
దు. అతఁడు ధరించినకవచమ్మును జూచితివా? దాని
ప్రభావమై యుండనోపు.

అర్జు—ఔనౌను; ఇతని కిట్టికవచం బెట్లు లభించెనో?

కృష్ణు—ఒకవేళ నాచార్యప్రసాద మేమో?

అర్జు—(స్మృతి నభినయించి) జ్ఞప్తికి వచ్చినది. ఈకవచమ్ము
దేవసంరక్షణార్థమై దేవేంద్రున కొక్క మహానుభావుం డొ
సఁగెనఁట. అతం డంగిరసున కిచ్చెను. అంగిరసుం డాత్మ
జుఁడైన బృహస్పతి కిచ్చెను. దేవగురునొద్దనుండి యగ్ని
వైశ్యుఁడును, అగ్నివైశ్యునుండి యాచార్యుఁడును సం
పాదించి రని యమ్మహాత్ముం డే చెప్పుచుండెడివాఁడు.

కృష్ణు—అర్జునా! ఇది యదియేమో? దీనిని భేదించినఁగాని
యితఁడు మనకు సాధ్యుఁడు కాఁడు.

అర్జు—వాసుదేవా! నాయొద్ద సర్వకవచభేద్యం బగుమహా
స్త్రం బొండు కలదు. దానిచే దీనిని బ్రతిహాత మొనర్తు
ను. చూడుము. (బాణప్రయోగము నటించును.)

[తెరలో]

అర్జునా! అర్జునా! సుయోధనునిపైఁ గోపకమును నీప్రాణములం గాచికొమ్ము.

శా. సారాచారనిరూఢుఁడైన ధనురాచార్యాత్మజుం డుండ, నీ, రారాజు వ్యధియింప నేరి కగు? నారాచమ్ము సంధింపఁ గ, న్నారస స్రగ్ని యూరకుందునె? రణంబం దామ రాధారు న్వ్వార గ్గావఁగ నెంచిన న్విడదు మద్బాణమ్ము ప్రాణమ్ములన్.

కృష్ణు—(అటుచూచి) అయ్యో! కవ్వడీ! నీచే విడువంబడిన మహాస్త్రం బాగురుపుత్త్రునిచేఁ బ్రతిహత మయ్యెను. మరలఁ బ్రయోగింపుము.

అర్జు—మహాత్మా! పునఃప్రయోగమ్మున కిది నిష్ఫలం బని వింటిమి.

చ. పరవశ మొప్ప నేఁ గనలి వారిజలోచన! దుర్మదాంధుఁడ్డీ, కురుపతి కంచుకం బవిసి కూలఁగ నస్త్రము నేసియుంటి; నా, గురుతనయుండు మధ్య నది శోభరమ్మునఁ గూల నేసె, నీ, వఱిమఱి నొంద నేల? వివిధాస్త్రములం బరఁగించి ద్రుంచెదన్.

ఈదురాత్ముం డీకవచమ్మున్నంతవఱకుఁ దన్నెవ్వరు గెల్వఁజాల రని కృతనిశ్చయుఁడై యున్నవాఁడు. నావింటిబలిమిచే సాధించెదను జూడుము.

(బాణప్రయోగము నటించును.)

కృష్ణ—(నిదానించి చూచి) అర్జునా! నీబాణంబులకునోర్చ్చి నిరాయుధుండై దుర్యోధనుఁడు పోవుచున్నాఁడు. వెన్నంటుఁదము రమ్ము. (నిష్క్రమింతురు.)

[అంత నాకాశమార్గమున యుద్ధప్రశంసఁ గావించుకొనుచుఁ జిత్రవర్ణవిచిత్రరథు లను నిరువురుగంధర్వులు ప్రవేశింతురు.]

చిత్ర—మిత్రమా! చూచితివా! బాలుఁడగు నభిమన్యుని మీఁది కేగినట్లుగా దుర్యోధనుని గాపాడుటకై వృషసేన, కర్ణ, శల్య, భూరిశ్రవ, కృపాశ్వత్థామాదు లొక్కుమ్మడి యర్జునునిమీఁది కరుగుచున్నారు.

విచి—ఎదిరింపనిమ్ము. ఏమిభయము! మున్నుత్తరగోగ్రహణకాలమం దెదిరించిన వీరులే కదా? అటుచూడు మతఁడందఱ నన్నివిశిఖంబుల నొప్పించి పాఱఁగొట్టుచున్నవాఁడు.

చిత్ర—మిత్రమా! ఆదెస సైన్యమ్ములు వెల్లురేగుచున్నట్లున్నది. చూడుము.

విచి—నిజము. మిత్రమా! ధర్మనందనుఁడు ధనురాచార్యునిఁ దాఁకుచున్నాఁడు.

చిత్ర—సఖా! చూచితివా! గురునిచే శరాఘాతముఁ గోల్పోయినధర్మనందనుఁ డింకొకకోదండమ్ము గైకొని, యొక

శక్తి నాచార్యుని కభిముఖముగా విడిచిపెట్టెను. అయ్యో! ఆచార్యుఁ డేమగునో కదా ?

విచి—భయ మేల? ఆచార్యుఁడు సామాన్యుఁడా? ధర్మజప్రయుక్త మ్మగుశక్తిని విఫలమ్ముఁ జేసి, ధర్మనందనునిచేఁ, దనబ్రహ్మాస్త్రమును గోల్పోయి, కోపాకులితమానసుండై గురుండు—

ఉ. కేతువుఁ ద్రుంచి, సారథిని గీటడఁగించి రథమ్ముఁ గూల్చి, నీ, వేతెఱఁ వేగిరఁ విడువ, నెవ్వరు వచ్చిన నుక్కడంతు, నా, చేతికిఁ జిక్కె తంచుఁ గవిసెఁ గురుఁ డాయమ మూను, నయ్యయో!, కాతరుఁ డైనధర్మసుతుఁ గంటివె? తమ్ముని తేరు నెక్కెడిఁ.

చిత్ర—మిత్రమా! ఈదెసఁ జూచితివా ! నకులవికర్ణులును, సహదేవదుర్ముఖులును, సాత్యకివ్యాఘ్రదత్తులును దలపడిరి. సహదేవుఁడు నొచ్చినదుర్ముఖుని వీడి, త్రిగర్తభూపాలునిం దాఁకెను. నకులునిం దాఁకినవికర్ణుఁ డెటకో పాఱిపోయెను. సాత్యకి వ్యాఘ్రదత్తునిం దునిమె. ఆహా! ఖండన మెంతఘోరముగా నున్నది.

విచి—(ఆశ్చర్యముతో) ఆహా! ద్రౌపదీపుత్త్రుల శౌర్యము. (తలపంకించి) సోమదత్తుఁడా వీరిపైఁ దలపడుఁవాడు? చిత్రవర్ణా! కనుఁగొంటివా?

ఉ. ఒక్కఁడు గాత్రముల్ మఱియు నొక్కఁడు చాపము, సూ
తుశీర్ష మింకొక్కఁడు, కేతువుం దునిమె నొక్కఁడు, చూ
డఁగఁ జోద్య మయ్యె, నిం కొక్కఁడు వానిశీర్షము రణో
ర్విని గూల్చెను; మేలు మేలు ఇ, ట్లక్కుమారుఁడుతఱిఁ
గవిసి మామయుఁ దండ్రులు సంతసింపఁగన్.

చిత్రి:—(మఱియొకవైపుఁ జూచి) అయ్యో! ఈదెసం గనుఁ
గొంటివా?

చ. సరభసుఁడై ఘటోత్కచుఁడు శస్త్రగురుం గవియంగ నే
గుచో, గురునకు నడ్డమై నిలిచి ఘోరశరంబు లలంబసుం
డు సంగరమున వీడ, సాత్యకియు బాసటయై చనుదేర
నాఁపి, భూవరులు తలంకఁ గొట్టి, నొక బాణముచేతను
వాని మక్కుకైం.

అలంబసుండు తనబాణమ్ము లన్నియు ఘటోత్కచునిచేఁ బ్ర
తిహతం బగుట నవలోకించి, మాయాయుద్ధమ్మునకుం
గడంగి, పాండవబలమ్ములకు జీకాకు నొందింప, ఘటోత్క
చుండు గినిసి, వానిని విరథుం జేసెను. అంత నాఘటో
త్కచాలంబసు లిరువురును, ముష్టియుద్ధమ్మునకుం దొ
రకొనఁ దుద నలంబసుండు మడిసెను.

విచి:—ద్రోణునితో నొద్దికనసాత్యకిం గని ధర్మనందనుం డద్ది
రమో తనసైన్యమ్మున కాజ్ఞాపించుచున్నట్లున్నది.

[తెరలో]

మ. కడఁకన్ ద్రోణుఁడు సాత్యకిన్ దునుమఁగాఁ గాలాంతకుం
డో యన, న్వడిఁ దాఁ బోయెడు; నూరకుంట తగవే, వా
రింపరా దొక్కో? యేగుఁడు వేగమ్మన, మీర లస్త్ర
గురునిన్ ఘోరాహవంబందుఁ దాఁకుఁడు, రక్షింపుఁడు
సాత్యకిన్, ముదము చేకూరంగ మా కెల్లెడన్.

చిత్ర—నిజము. నిజము. (చూచి) అక్కటా! ఏమి యీ ముదుసలిపాఱుని యుద్రేకము. ఇతనిం దాఁకిన పాండవ బలం బంతయుఁ బటాపంచలై పోవుచున్నది.

[తెరలోఁ గలకలము.]

చిద—(తేఱిపాఱఁజూచి) అదేమి? ధర్మనందనుం డట్లు తల్లడపడుచున్నాఁడు!

చిత్ర—(ఆలకించి) సందడి చేయకుము, సాత్యకి కేదియో బోధించుచున్నాఁడు.

[తెరలో]

మ. కర మాశ్చర్యము దేవదత్తరవ మాకర్ణింపఁగా రాదు నా,
కరయం గృష్ణునిపాంచజన్యరవ మేపారంగఁ జొచ్చెం
గటా!, హరి సంగ్రామముఁ జేయఁ గారవుల బాహాశక్తి
మైఁ దాఁకెనో, నరుఁ డేమయ్యెనో? చూడఁ బొమ్ము కల
నన్ [illegible] మిచ్చటన్.

చిచి—పాపము! కృప కృతవర్మ శల్యాశ్వత్థామాదు లేమి

చేసిరో యని యాతనిమనం బిట్లు తల్లడపడుచున్నది. (తలపంకించి) ఔను! అట్లుండు టబ్బురమా! వారుమా త్రిము సామాన్యులా?

తే. గీ. శూరు లందఱు రణమున శూలినైన
గెల్వఁ జాలినయట్టిశక్తిం గలారు
ఫల్గునుం డొంటిగాఁ జనె భండనమున
కందుచేఁ దల్లడిల్లె యమాత్మజుండు.

చిత్రి—సఖా! కృష్ణానుజుం డేదియైన ధర్మనందనునకుఁ బ్రత్యుత్తర మిచ్చునో లేక యాతనియాజ్ఞానుసారము వర్తించునో తెలియకుండఁగనే సందడిఁ జేసెద వేల?

[తెరలో]

మహారాజా! ద్రోణునిప్రతినం దలంచి కృష్ణార్జునులు మిమ్ముల వీడకుండు మని నన్ను నిరోపాగింప నిట వచ్చితిని. క్షమింపుఁడు.

విచి—పాపము! ద్రోణునిచే ధర్మనందనుని కేమిమోసము వాటిల్లునో యని యతం డట్లాచరించియున్నాఁడు. (విని) మరల నేదియో పల్కుచున్నాఁడు.

[తెరలో]

సాత్యకీ! నన్నుఁ గాపాడఁ దగుయోధులు పెక్కురు గలరు; కాన నాయందలివాత్సల్యమ్ముచే నర్జుననిసేమ మారయఁ బొమ్ము.

విచి— పాపము! సాత్యకి నిరుత్తరుండై భీముఁ, ధర్మనందన
రక్షణకు నియోగించి, కృష్ణార్జునులజాడ నరయుచు ము
గ్గరమ్ముదెసఁ బోవుచున్నాఁడు.

చిత్రి— అయ్యో! చూచితివా! సాత్యకి గురునిసెలవుఁ గై
కొని కాంభోజసైన్యముఁ జొచ్చెను. ఆహాహా! ఆచార్యు
నిదయాళుత్వము; అర్జునునినే గాక సాత్యకినిఁగూడ వీడి
నాఁడే!

విచి— సఖా! తనబాణవిద్యాకౌశలమ్మునఁ గాంభోజపతిం
దెగటార్చి, సుదర్శనజలసంధాదులఁ బెక్కండ్రం గెడప,
దుశ్శాసనుం డెదుర్కొని విముఖుండై యాచార్యునొద్ద
కరుదేర, నతం డాయువరాజు నేమనియెనో వింటివా?

చ. "కురుపతియాజ్ఞ నొంది సభ ఘోరముగా ద్రుపదాత్మసం
భవన్, బరిభవముం బొనర్చితివి; పాపఫలంబును బొం
దుచుంటి, ని, ష్ఠురరభసం బెలర్ప మధుసూదనుతమ్ముఁ
డెదుర్కొనన్ శరో, త్కరమున నొంప కిట్లు చనఁగాఁ
దగునా యువరాజ! వెఱ్ఱివె?

తే. గీ. ద్రోవదిని భంగపుచ్చినదుర్మదాంధు
వక్షమును జించి రక్త మవారితముగఁ
ద్రావెద నటంచుఁ బ్రతినను దాల్చె భీముఁ
డెందు కాసాత్యకి నెదుర్ప డిందవడెదు?

నీకంఠభరమనితోఁచినయెడల రాజుతో యోజించి పాంపునం

దనులకు రాజ్యభాగం బిచ్చి కలసి యేలుకొనుఁడు. లేదా? సహాయులతో సాత్యకి నెదుర్కొనుము. అంతయు కాని యీరీతి రణభూమి వీడుట ధర్మము కాదు. పో మ్మన దుశ్శాసనుండు నిరుత్తరుఁడై సాత్యకిదెస కరుగ చున్నాఁడు.

చిత్రి—సఖా! ఇటు చూచితివా ? ఆచార్యునిరథముపై ధృష్టద్యుమ్నుఁడు లంఘించి యాతనిఁదునుమఁ బోవుచున్నా డు. అయ్యో! అయ్యో! ఇంకెక్కడిగురుఁడు ?

విచి—(తేఱిచూచి) మిత్రమా! తొందరపడెద వేల ఇప్పుడు చూడుము. గురుండు మూర్ఛదేఱి పార్షదుని నొప్పింప, నతఁడు పలాయితుఁడై నిజస్యందనమున కరుదెంచుచున్నాఁడు. కటకటా! బంధువియోగ మెంతదుస్సహమైనది. వీరకేతు, చిత్రకేతు, చిత్రవర్మ, చిత్రరథులను గురుఁడు చంపుటచేఁ గదా పార్షదుఁ డిట్లు సాహసించుట!

చిత్రి—సఖా! మన మాసమరమే విలోకించుచుంటిమి కాని సాత్యకిచే దుశ్శాసనుఁ డేమయ్యెనో విలోకింపకుంటిమి.

విచి—(మఱియొకవైపునకుఁ దిరిగి) అయ్యో! తమ్మునికిఁ దోడుగా రాజుచేఁ బంపఁబడి, త్రిగర్తసేన సాత్యకియెదుట నిలువక దైన్యము నొంది ద్రోణునిదెస కరుదెంచుచుండె ను. దుశ్శాసనుండుమాత్ర మాశైనేయు నెదిరించె. (తే ఱిపాఱఁజూచి) సాత్యకి దుశ్శాసను రథాశ్వసూతకేతనమ్ముఁ

లఁ దుఱించి చంపకుండెనే! దీనికిం గత మేమైయుండునో? (యోజించి) ఔను.

శా. కుంతీమధ్యమపుత్త్రుఁ డొట్టిడికొనెం దాఁ గోపంబు రెట్టింపఁగన్, బంతం బొప్పు రణాంగణమ్మునను నీవక్షంబుఁ జెండాడి ని, శ్చింతన్ రక్తముఁ ద్రావువాఁడ ననుచున్ జేఁజిక్కిన న్నందుచే, నంతం బొందఁగఁ జేయ మానె నిఁక పోరా పొమ్ము దుశ్శాసనా!

చిత్రి—మేలు మేలు! సాత్యకీ! ధర్మపాశబద్ధుం డగుభీముని ప్రతిజ్ఞాభంగమ్ము కాకుండఁ జేఁజిక్కినశత్రుని విడిన నీ న్యాయ మెంతయు శ్లాఘాపాత్రము.

విచి—మిత్రమా! ఈసమయ మెంతయు మనము జాగరూకతగా నవలోకింపవలసి యున్నది.

చ. ఒకదెసఁ బార్థుఁ డుంచు కురుయోధుల ధర్మజ భీమ మాద్రిపుత్త్రకులసహాయ మంది రణరంగమునన్ దెలిలించుచుండె; నిం, కొకదెసఁ బార్థకృష్ణులు రణోర్విని శత్రులఁ దాఁకుచుండిరి, సా, త్యకి వడిఁ దాఁకెఁ గౌరవుల దారుణభంగి యుగాంతరుద్రుఁడై.

అదియునుంగాక గురుండు కౌంతేయబలమ్ముఁ జెండాడుచుండె.

చిత్రి—అయ్యా! కురునాథుం డేయుబాణంబుల నఱకుధర్మనందనుని పై నురువడించు నాచార్యుని మార్గాని బృ

హాత్ష్ణత్రి, దృష్టకేతులు, సమసినతర్వాత నవ్విప్రుండు ముదుసలియయ్యును బాలభానునిభాతి భాసిల్లుచుఁ జేకితానుని విరథుం జేసి పాఱఁగొట్టె.

విచి—సఖా ! సాత్యకిని బంపినను దనతమ్మునిక్షేమం బరయనేరక, ధర్మజుండు పవనపుత్రుని బంపుచుండనోపు. ఆదెసం గనుఁగొమ్ము.

చిత్రి—(చూచి) ఔనౌను. పార్షదుని ధర్మజరక్షణకు నియోగించి భీముండు కౌరవకుమారులఁ బెక్కండ్రిం గెడపి, యాచార్యుఁ దాఁకుచుండె (ఆశ్చర్యముతో) అవురా ! ఆచార్యుని వాత్సల్యము. "ఓహో! వాయుకుమారా ! నన్ను గెల్చికాని మొగ్గరమ్ముఁ జొఱ నశక్యమ్ము. అర్జును నట్టివీరుఁడే మదాజ్ఞ నొంది లోనికిం జొచ్చె. నీ వెంత? ఆఁగు మాఁగు" మని నిలువరించెను. (మెప్పుతో) నిజము, నిజము! ఆచార్యా! నీ వట్టివీరుండవే యగుదువు. కాని— (అర్థోక్తియందు)

విచి—సహోదరా! ఆచార్యున కావాయునందనుఁ డేమి ప్రత్యుత్తరం బిచ్చెనో వింటివా?

ఉ. "ఎక్కటికయ్యమందు హరు నేర్తెఱ గెల్చినఫల్గునుండు,
తా, నొక్కనియాజ్ఞ నొందునె రణోర్విని, పొందెడుఁగాక,
దైన్యమే, నుక్కడఁగింతుఁ గాచుకొను మోయమలాత్మ!

మహానుభావ! నే, నక్కఱకుం బ్రవర్తిలిన నక్కట! నన్
రిపు లేవగింపరే?"

అని వాకుచ్చె.

చిత్రి — ఔను! భీముని పరాక్రమము వెనుదీయునది కాదు.
కాని యీ బ్రాహ్మణవీరుని ముందితఁ డెంతవాఁడు?

విచి — సోదరా! అట్లనఁజెల్లునా! ఎంతెంత బలవంతులకైన, నొక్కొక్కప్పుడు విపరీతకాలమ్ము రావచ్చును. (చూచి) కనుఁగొంటివా భీముని విక్రమము? విరథుండై వే ఱొకరథం బధిష్ఠించిన గురునికోర్కెల కోర్వలేక,

ఉ. స్యందనముం ద్యజించి, గురుశస్త్రములెల్ల సహించి విస్మ
యం, బంది సురల్ నుతింప, రథ మల్లన నెత్తుచు, నొక్క
పెట్టన, స్పందితుఁడై, బకారి బలవంతముగా విసరన్
గురుండు తా, గందరగోళ మైనమది గల్గి రథమ్ము డిగెన్
రయమ్మునన్.

శిష్యుని ఘోరకార్యమ్మున కాచార్యుఁడే సంతసింపుచుండెను.

చిత్రి — సహోదరా! గురుని నిర్జించి, సైన్యంబుఁ జొచ్చి వీర విహారంబు సల్పు వాయుపుత్త్రు నెదుర్కొని కర్ణుండు విరథుం డగుట నవలోకించి, రారాజాచార్యునికడ కేతెంచుచున్నవాఁ డెందుకో?

విచి — ఎందుల కననేల? మరల గురుని నిందించుటకైయుండును. మూర్ఖుఁడు యుక్తాయుక్తమ్ము లెఱుంగఁడు కదా?

మ. గురుఁ డాశ్చర్యముగా రిపుల్ విడఁటచేఁ గోపించి దుర్యో
ధనుం, డరయన్నేరక ముందువెన్కలను, నయ్యాచార్య
నోనాఁడ, నీకరణిన్ రాదోడఁగెం గనుంగొనుము, లోకం
బాకులం బొంద సం, గరముం జేయు గురుం డటం చె
ఱుఁగఁడో? కాలమ్ము దాపయ్యెనో ?

చిత్రి—సోదరా! వింటివా దుర్యోధనుని మాటలసొంపు !

చ. "నరు విడఁజెల్లుఁగా కనిలనందను సాత్యకిఁ జూచు చూ
రకే, దురమున నీకు తొప్పగునె?, ద్రోణుఁడు గల్గ కొ
అంత లేదటం చరసితిఁ గాని, యీవిధము న్యాయము నీ
డుదువం చెఱుంగ, నో, గురుఁడ ! మహోపకార మిటు
కోరి యొనర్పఁగ నీకుఁ జెల్లునే?"

విచి—భీముని పీడుటచేతనే ధర్మనందనుని కర్జునుని శుభ
వార్త వినఁబడునట్లు సింహనాదంబుఁ గావింపఁగలైను.
లేకున్న నింతఘోరసమర మాచరించుపార్థుఁడు దేవద
త్తంబుఁ బూరించుటకు వీలు లేకయేపోవును. చూచితి
వా, ధర్మనందనుని ముఖవికాసము !

చిత్రి—సోదరా! ఆచార్యుని ప్రత్యుత్తర మాలకించితివా?
"ఓయీ! మూఢదుర్యోధనా! నీవెడమాట లిఁకఁ గట్టి
పెట్టి త్వరగాఁ బోయి, సుస్థిరోత్సాహముతోడ నద్దైన
నున్న కర్ణాదియోధవరులతోఁ గూడి, కవ్వడి మొదలగు
నమ్మువ్వర నిలువరించి సైంధవుఁ గాపాడుకొనుము. నే

నీ మొగ్గరముఖమ్మున నిల్చి లెక్క నవారి నిలువరించెదను.

హా" మ్మన నిరుత్తరుఁడై పోవు రారాజుమీఁద నాయుధా మన్యయుత్తమోజులు గవిసి విరథులై, వానిని విరథునిఁ జేయఁ బాప మాతఁ డాశల్యునరదం బెక్కి పోవు చున్నాఁడు.

విచి—సఖా! ఈపనఁ గనుఁగొనుము. కర్ణుఁడు మరల భీమునితోఁ గయ్యమునకుం ఁకొనుచున్నాఁడు.

చిత్రి—డీకొనినమ్మ. మన మెఱుఁగనికర్ణుఁడాయేమి? మరల విరథుండైన కర్ణునిఁ గావ రారాజు దుర్జయునిఁ బురికొల్పుచున్నాఁడు (నిదానించి) పాప మాతఁ డొక్క పెట్టన నే నేలఁ గూలినాఁడే!

విచి—సోదరా! మరల భీము నెదుర్కొనినకర్ణునిఁ గావ దుర్ముఖు నంప నాతండును గూలెను. (నిరూపించి) ఈసారి కనుము. రాధేయుఁ డాభీముని బారి నుండనొల్లక, రథంబుఁ దోలఁగఁ జేయుచున్నాఁడు.

ఉ. మాధవుపల్కులం దనదుమానసమందునఁ జేర్పఁ డంగభూ, నాథుఁడు కల్గియుండఁగ, మురారిసమేతము గాఁగఁ బాండుభూ, నాథతనూజులన్ గెలువ నా కొకపాటిదిగా దటంచు, దుర్యోధనుఁ డట్టికర్ణుఁ డనినోడుట కేమి తలచునో మదిన్?

చిత్రి—తలంచుట కేమున్నది? కాల మనివార్యము కాని కర్ణునిముందు భీముఁ డెంతవాఁడు! ఇంతకుఁ బాండవులకు దైవబలంబు మెండు. కాకున్న నింతమందికురుకుమారు లొక్కసారిగ నమ్మారుతిచేఁ గూలుదురా?

విచి—(తొందరతో) చూచితివా? అతిరౌద్రాల్లసితమూర్తియై భీముఁ డారాధేయునిరథంబుపైకి లంఘించుచున్నాఁడు.

చిత్రి—(దృష్టి నిగుడించి) అయ్యో! కర్ణుఁ డారథంబున దాఁగియున్నాఁడే! ఇతఁ డలుకునప్పటి కాతఁడు పాఱిపోవువానివలె నటించి యందే దాఁగియున్నాఁడు.

చ. అరదమునందె దాఁగెను దురాత్మకుఁ డంచు నెఱుంగ
కావృకోదరుఁడు కృపాణిఁ దాల్చి భయదం బగురూప
ముతోడఁ గర్ణునిఁ, బిరథుని జేసిచేసి పెనువేసట నొందిన
వాఁడు గాన, సం, గరమున వాని నొంచుటకుఁగా నిటు
దాఁటుచునుండె వెట్టియై.

విచి—(తొందరతో) కటకటా! భీముఁ డాసూతాత్మజుచేతఁ జిక్కినాఁడే! (నిరూపించి ఆశ్చర్యముతో) ఏమి చెపుమా! కర్ణుఁ డీతని విడినాఁడు?

చిత్రి—ఏల యాశ్చర్యము నందుచుంటివి?

శా. కుంతీమధ్యము సూతనందనుఁ డరుక్రోధంబునం బట్టియుం, గుంతీవాక్యములం దలంచి మది సంకోచించె,

లేకున్నఁ ద; న్నింతే నొవ్వఁగఁ జేయ నేమనొకో? ఏఁ డెం
దుఁ సధర్ముండు, దు, శ్చింతి న్వాయుకుమారుఁ జంపి తన
నచ్చిలమ్మ వోనాడునే?

విచి—(ఆలకించి) ఆఁగు మాఁగుము. కర్ణుఁ డేమనియెనో విం
టివా?

చిత్రి—లేదు. ఏమనియెను?

విచి—ఇట్లనియెను.

శా. "వంటం జేయ విరాటుపట్టణము చేవ న్వీడి చేరంగనౌ,
గొంటుక్ శక్యమె నన్నుఁబోటుల నరిన్, గోత్రోద్భవుం గా నొ
ప్పునే, కంటెన్ ధీరులు నన్నెదుర్కొనఁగ లేకం బోరె,
భీరుండవై, యింటం గూర్చొని వంటఁ జేసికొన కిట్లేతేలఁ
గా నేటికిన్?

తే. గీ. పొమ్ము సదనమ్మునకుఁ దిండిపోత! సమర
భూమిఁ జేరంగ సిగ్గేది? పొలఁతి కట్లు
నిండుకొల్వున దుశ్శాసనుండు వల్వ
లొల్వఁగాఁ జూచి క్షత్రియుం డూరకొనునె?"

చిత్రి—కటకటా! ఏమి యీసూతాధముని పోటుమాటలు?
వినుటకు భరము గాకున్నవే! పాప మాభీముఁడు చిన్నబు
చ్చుకొని తమ్మునివంక కరుగుచున్నాఁడు.

విచి—సోదరా! కృష్ణార్జును లెందుకో తొందరతో నిటు వ
చ్చుచున్నారు చూడుము.

చిత్రి—(తేటివఱఁజూచి) అయ్యో! అయ్యో! భూరిశ్రివసుం డాసాత్యకినిఁ జంప నుద్యోగించుచున్నాఁడు. ఈదెబ్బతో సాత్యకి బ్రిదుకుట దుర్లభము.

విచి—అయ్యా! కృష్ణార్జునులు కాపాడుచుండ సాత్యకి నీభూరిశ్రివసుం డేమిచేయఁగలఁడు? (చేతితోఁ జూపుచు) దృష్టిసారించిచూడు మాకృష్ణుఁ డేదియో పార్థునకుఁ జూపుచున్నాఁడు.

చిత్రి—(చూచి) సహోదరా! నాకు సరిగాఁ గనపించుట లేదు. దగ్గఱకుఁ బోయి చూతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





శ్రీమత్పరదేవతాయైనమః.

# విజయప్రతిజ్ఞ.



## పంచమాంకము.



యుద్ధభూమి.

[కృష్ణార్జునులు ప్రవేశింతురు.]

కృష్ణ — (ఆత్రముతోఁ జేచాయఁ జూపుచు) అర్జునా! అల్లదే సాత్యకిం గనుంగొనుము.

మ. వనమందుం గరినాథుఁ డెల్లెడల దుర్వారోద్ధతిన్ దిగ్గి
యా, వెనుకన్ నక్రము బారిఁ జొచ్చువిధ మావీరుం డనిన్
సోమదత్తునిపుత్త్రిన్ వడిఁ దాఁకి లోఁగి మిగులన్ దుఃఖ
మ్మునం డిందె, నాతని సాయం బొనరించి ప్రోవఁదగు వే
దాక్షిణ్యముం జూపుచున్.

అర్జునా! తొందరపడుము. భూరిశ్రవసుండు సాత్యకిని గ్రిం దఁ బడవైచె. వేగం బొకబాణంబున శాత్రవుం దునిమి నీశిష్యుని గాపాడుము.

అర్జు — కృష్ణా! అధర్మమున కెట్లొడిఁగట్టుమని యెదవు?

ఉ. న న్నెదిరింప లేదుగద నందకుమార! రణంబునందు నే
నన్నరనాథు ధర్మవిధి నావలఁ ద్రోయుచు కారణంబు లే
దన్న నెటుల్ వధింతు నిది యాహవధర్మమె? పార్థుచి
త్త మిా, వన్నవిధంబుఁ జేయఁ జనదయ్య! క్షమింపఁగ
దయ్య! మ్రొక్కెదన్.

కృష్ణు—అర్జునా! ఇంతకంటెఁ గారణం బేమికావలయును? ఊరకున్న యెడల నిష్కారణము సాత్యకిం బోఁగొట్టుకొన్న వార మగుదుము కదా ?

ఉ. బాగుగ నేర్చి తెచ్చిటనో పార్థుఁడ యాహవధర్మ మింక
నీ, వీగతి ధర్మపన్నముల నెల్లఁ బఠింపఁగ వేళ లేదె? ఆ
హా! గణుతింపఁ జెల్లు విపదంబుధి మున్గిన శిష్యు దైన్యమున్
వేఁ గృపఁజూపి ప్రోవఁదగు వీరశిఖామణి దైవవంచితుఁ్.

కం. వినుము కృపాళుఁడవై నీ
మనమునఁ గలసందియంబు మానఁగవలయున్
గన నసువుల కాపద గ
ల్గినపుడు నీరీతిఁ దప్పఁ గూడును పార్థా!

అదియునుంగాక,

శా. నీకున్ శిష్యుఁడు నాకుఁ దమ్ముఁడు యశోనిర్ణిద్రుఁ డెంతేని
దా, వీఁకన్ సాయముఁ జేయవచ్చి యిటు దోర్వీర్యంబుచే
శాత్రవా, నీకంబు న్విదళించి తుట్టతుదకున్ నిర్బంధితుం

డయ్యోధనా, నీకుఁ న్యాయమె మిన్నకుండు? టిఁక వానిం
బోరఁగాఁ జూడుమా.

అర్జు—కృష్ణా! మిత్రునిచావు చూచుచు నేనుమాత్రి మూర
కొనఁ గలనా ? ఈమహారథికు లందఱును, నన్నుఁ జుట్టు
ముట్టియున్నారు. అయినను వీరల నిలువరించి సాత్యకిని
గాపాడెదను. నీవు స్వస్థచిత్తుండవై యుండుము.

కృష్ణ—అర్జునా ! తొందరపడవలయును. ఇంకను నూరకుం
డెద వేల? శాత్రవుఁడు సాత్యకినిఁ గ్రిందఁ బడవైచి, వాము
బాహువారంబుల రెండుకాళులఁ దొక్కియుండె.

మ. ఇఁక నాలస్యముఁ జేయుచో శినివరుం డీల్గుఁ బృథాపు
త్ర! నీ, వొకబాణమ్మున శత్రు నేయవలె, నయ్యో !
కత్తి పైకెత్తె వాఁ, డకటా! జాగొనరింపకయ్య, త్వర నా
కాహ్లాదముం గూర్చి సాత్యకినిం బ్రోచి యశంబు నంద
రిపువిధ్వంసంబుఁ గావి పుమా !

అర్జు—(బాణప్రయోగము చేయును)

కృష్ణ—(సంతోషముతో) అర్జునా ! మంచిపనిఁ జేసితివి.
మనసాత్యకి కింక భయంబు లేదు. భూరిశ్రవసునిచేయి
ఖండింపఁబడినది. పార్థా! ని న్నేమనియగ్గింతును; ఇంతటు
నో ధైర్యంబును, నింతటియస్త్రపాండిత్యంబు నెవ్వరికిఁ
గలుగును !

అర్జు—బావా! స్తోత్రపాఠమ్ములచే నన్ను సిగ్గుబఱుపకుము.

ఇదఁ తయు నీకరుణావిశేషము. (వినుట నభినయించి) భూరి శ్రివసుం డేదియో కినిసి పల్కుచున్నట్లున్నవాఁడు.

[తెరలో]

మ. నిను నే నేయఁగలేను; వేఁటొకనితో నిండారుకోతూహ లంబున యుద్ధం బొనరించుచుంటిఁగద; నీ వో మేనలుం గ! రణా, వని ధర్మంబును వీడి నాకరము నో పార్థుండ! ఖండింపఁగాఁ, జనునే? నవ్వరె యిట్లొనర్చుటయు నీచం బంచు సుక్షత్రియుల్ ?

అర్జు—సోమదత్తపుత్త్రా! ఏమి ధర్మోపన్యాస మొనర్చుచుం టివి ?

తే. గీ. అలసియుండిన సాత్యకి నలసుఁడ వయి
చంపఁబూనినధర్మప్రశంస చాలుఁ
దలచితే ? సాత్యకిం జంప సులభ మనుచు
నీవల విజయుఁ డాతనిఁ గావనుండ !

కృష్ణు—(తనలో) పాప మాభూరిశ్రివసుండు కించ నొందు చున్నాఁడు. తాను గావించినది ధర్మకార్యము కాదనియుఁ బాపాత్ముం డగుసుయోధను నాశ్రయించుటచేఁ దన కిట్టి పాటు గలిగెననియుఁ జింతించు నీతని నూఱడించెదను. (ప్ర కాశముగా) ఓయీ! బాహ్లీకపౌత్త్రా! ఊఱడిల్లు మూఱ డిల్లుము. అధర్మపక్షమునఁ జేరితి నని విచారింపకుము. నీకుఁ బుణ్యలోకములు గల్గునట్లు వరం బొసంగితిని.

అర్జు—(తొందరతో) సాత్యకీ! ఆఁగు మాఁగుము. అధర్మం బాచరింపకుము. అస్త్రవిసర్జనంబుఁ జేసి యోగనిష్ఠచేఁ బ్రాణంబులు బాయనున్న భూరిశ్రవస్సుకంఠము దునుముట పాడి గాదు.

సాత్య—(ప్రవేశించి)

చ. వరమును గొన్నగర్వమున వక్షముపై ననుఁ ద్రొక్కి కే-
శితఁ డా,పరిభవము సహింపఁ దగుపాటిది కాదని లోఁ
దలంచి, యీ వైరవరిఁ గూల్చితిఁ గాని మది వివేకము విడితి
తప్పుఁ జేసితిఁ గా, బయుఁడను గాను, గాన ననుఁ బాలన సే
యుము పాండునందనా!

అర్జు—సాత్యకీ! ఎంతపనిఁ జేసితివి. నేను వలదు వల దనుచుండ నీ కింతదుందుడు కేందులకోయి?

సాత్య—(సిగ్గుచేఁ దలవంచి యూరకొనును.)

కృష్ణు—అర్జునా! గతజలసేతుబంధన మేల? దీనికిఁ బూర్వజన్మగాథ చాలఁ గలదు. దానిని సావకాశంబుగ నీ కెఱింగించెదను. (చేతితోఁ జూపుచు) అదియే దారకుఁడు రథంబాయత్తము చేసికొని నాయాజ్ఞానుసారంబుగా నిటఁ గొని వచ్చుచున్నవాఁడు. అలసిపోయినసాత్యకి శత్రుసులభుఁ డగును గాన, నారథంబుపైఁ బంపెద (సాత్యకివైపుఁ దిరిగి) తమ్ముఁడా! మనదారకుఁడు గొనివచ్చిన రథంబునం దధి

ష్ఠించి యిఁక నవమానభయంబు నీడి రిపువర్గయుండవు గమ్ము.

సాత్య—చిత్తము. (అని నిష్క్రమించును.)

అర్జు—(వ్రేలితోఁ జూపుచు) మాధవా! చూచితివా! సాత్యకి రథం బధిష్ఠించి, భూరిశ్రవస్సును జంపుటచే గినిసి తన్నెదు ర్కొనుకర్ణు నెట్లుతాఁకుచున్నాఁడో? మన మాతనివిష యమై స్వస్థతఁ జెందవచ్చును.

కృష్ణ—అర్జునా! మన మింకఁ దొందర పడవలయును. (ఆ కాశమువంకఁ జూపి) చూడుము. ప్రొద్దెంతయో లేదు.

శా. భానుం డస్తగిరీంద్రసన్నిధికిఁ బోవంజొచ్చె నొక్కింత నీ పై నాలస్యము సేయరాదు నడు మోపార్థుండ! వేవేగ మా, భూనాథుండు దలంక సైంధవుదెసం బోవంగ నో; మధ్యమా,గ్రానం జూచితె? నిల్చె శత్రుధరణీంద్రవ్రాత మాటంకమై.

కావున, నీయస్త్రవిద్యాపాటవం బంతయు వినియోగింపవల సినకాలం బిదియె; రమ్ము! పోవుదము.

(అని పరిక్రమింతురు.)

కర్ణ—(సంరంభముతోఁ బ్రవేశించి)

చ. నిలు నిలు మోరిపార్థ! ధరణీవరుపంపున సింధుభూపు న ర్మిలిఁ గాని కావవచ్చితి నరిందము నన్నని గెల్వకుండ నీ తలమగునే జయద్రథునిఁ దాఁకఁగ మామకసాయకంబు

వ్రి, కృలుగ నొనర్చు నీశిరముఁ గాచికొనన్ గమకింపు
మి త్తఱిన్.

అర్జు—ఓరీ! నిర్లజ్జాపౌరుషధారేయ! రాధేయ!

మ. మును నీచేసినపుణ్యలేశముననో, మూర్ఖుండ! నీ కాయు
విం, కను నేకోశమునందొ కల్గుటనొ, మున్గావించు నాత్రప
త్యయం, బును మోఘుం బొనరింపకుండుటకొ! ని న్నోర్చితా
ర్పకుండ న్వాడెక్, శిరిపర్యం డతెనొక్కా సిగ్గు మఱిలక్
జేయంగ సంగ్రామముక్.

కర్ణు—ఓరీ! వాచాటా! అంతమాత్రమున నే యోడినటు లెం
చెదరా!

కం. గెలిచెద రోడుదు రంతనె
బలుల న్నిందింపరాదు, వటుదర్పమునక్
గలన న్నిల్చిన నే నీ
తలఁ దఱుగుట నిక్కువంబు దర్పాంధ! యిఁకక్.

కృష్ణు—ఓయీ! వృథాపౌరుషాభిమానీ! ఇన్నినీతులు నే
ర్చినవాఁడ వగుటచేత నేకాఁబోలు భీము నెకసక్కెంబుల
కుం గడంగితివి! (అర్జునునితో) పార్థా! వృథావాగ్వ్యయ
మేల? పోటరివోలె మాటలాడుటంబట్టియే సుయోధనుం
డీతనికి లోఁగి సంగ్రామమునఁ బ్రవర్తించుచున్నాఁడు. వీఁడు
మడిసినయెడల నన్నియుఁ జక్కఁబడును.

ఉ. సూతసుతుం బృథాతనయ! శూరులు చోద్యము నంద
బాణసం, పాతమున న్వధింపవలె వమ్మొనరింపకుమయ్య!
కాల మిూ, పాతకిఁ జావకుండ జనపాలుని సైంధవుఁ జేర
నేర మ, య్యా! తపనుండుఁ జూడు మపరాంబుధిఁ జే
రఁగఁ బోయెడుఁ సఖా!

అర్జు—చిత్తము. (బాణప్రయోగము నటించును.)

కర్ణు—(నిరాయుధుఁడై నిష్క్రమించును.)

కృష్ణ—(చూచి) అర్జునా! అదె కర్ణుఁడు నిరాయుధుండయ్యె.
ఇతని నింతతో వీడుము.

మ. అదిగో చూడుమ! సూకరంబుఁ గనుఁగోనా యెన్ ధ్వజం
బందు న, య్యదియే సింధునృపాలుతే, రచె యతం డా
రాటముం జెంది నె, మ్మది కంపించుచునుండె వేగ మతనిఁ
మాయింపఁగాఁ జెల్లు, నీ, యదను న్వీడకుమయ్య! వీడు
నెడ సైన్యం బడ్డమై నిల్చెడిఁ.

అర్జు—కేశవా! ఈబాణ మాతనిఁ దప్పక దునుమాడును.

(బాణమువిడచును.)

[తెరలో]

మ. చదిసె న్సారథి, కేతనంబు వడియెఁ, సాహాయ్య మేవం
కలే, క దిగు ల్సొందెదు సింధురా జయయెు! యాకర్ణుండ!
యోద్రోణ! మిూ, గ్గదియంబోవుఁడు, చూపఁగాఁ దగును

మీకారుణ్యవిస్తారసం, పద, లేకన్ బాలియించు సింధు
నృపు నవ్వార్థుం డిదే యమ్మునన్.

[అంతట గర్ణాశ్వత్థామలు ప్రవేశింతురు.]

అశ్వ—(కోపముతో) అర్జునా! ఆఁగు మాఁగుము. మాతం
డ్రిగా రభయమిచ్చిన సింధునృపాలుం గడతేర్ప నాకం
ఠమ్మునం బ్రాణమ్ము లుండ, ధర్మయుద్ధమ్మున నీకు సాధ్య
మ్ము కాదు. మమ్ముల మాయించినతరువాత సైంధవుని
కొఱకై యత్నింపుము.

అర్జు—(వినిపించుకొనకయే నిర్వేదముతోఁ బెదవివిఱచి) కృ
ష్ణా! నాబాణంబు తప్పక సైంధవుం దునుమాడు నని త
లంచితిని గాని, సారథిం దునిమి, కేతనమ్ముఁ గూల్చుట
తోడనే సంతృప్తిఁ జెందె. (సూర్యునివైపుఁ జూచి)

శా. గోవు ల్వచ్చెడుకాల మయ్యె! నదిగో గోపాల ప్రాద్దెంతో
లే, దావంకం గను గొమ్ము

(అశ్వత్థామాదులఁ జూపి)

వీరలును నా కడ్డంబుగా వచ్చిరే, నేవీఁకన్ వధియింతు
సింధునృపు నే నివ్వారి దాఁటన్ వలెన్, నీవే దిక్కుఁగ
న్మేదో మార్గమున నీ నేర్పొప్పఁగాఁ బన్నుమా.

కృష్ణు—అర్జునా! అంత నిర్వేదముఁ బొందెద వేల? ధైర్యము
వహింపుము.

(చెవిలో నేదియో చెప్పునట్లు నటించుచుఁ జక్రిముతో సూర్యుని గప్పును.)

కర్ణు—(ఎలుఁగెత్తి సంతోషముతో)

శా. వమ్మయ్యెన్ శపథమ్ము పార్థున ! హాహా! భానుండు గ్రుంకెన్, దమం, బిమ్మై వ్యాప్తిని జెందె; తార లవిగో నీక్షింపుఁ డాకాశమం, దెమ్మైన్ వర్తిలినన్ భయం బొకటలే దింతేనియున్ సైంధవా!, పొమ్మంచున్ సెల విమ్మ సైన్యములకున్ భూపాల! దుర్యోధనా!

కృష్ణు—(జనాంతికముగా) అర్జునా! ఇదే సమయము. జయద్రథుండు స్వేచ్ఛానువర్తియై సంగరమందుఁ దిరుగుచున్నవాఁడు. రమ్మతనిఁ గడతేర్తువుగాక. (నిష్క్రమింతురు.)

కర్ణు—(తోడియోధులతో) మనము కిరీటియొక్క ప్రతిజ్ఞాభంగమ్మును జెప్పి రారాజును సంతోషపఱుతము రమ్ము. (పరిక్రమించి ముందుఁ జూచి)

తే. గీ. తార లన్నియుఁ గ్రమముగాఁ దరలిపోయె
నఖిలదిక్కులఁ దొలఁగెను నంధకార
మరుణబింబమ్ము పడమర మరలఁ దోఁచె
నచ్చెరువు గల్గె నిప్పుడివన్నియుఁ గన.

అశ్వ—(తొందరతో) కర్ణా! కర్ణ! త్వరపడుము. త్వరపడుము. కృష్ణుఁ డేదియో మోసముచేసి మనల వంచించియుండనోపు.

తే. గీ. అరుణుఁ డదె గ్రుంకిపోయె నస్త్రాద్రి ననుచు
సంతసింపుచు నుంటి మాసవ్యసాచి
ప్రతిన నెఱవేఱ మాయగోపాలుఁ డిట్లు
చేసె మోసం బటంచు నెంచెదను మదిని.

(ఎదుటఁజూచి) అయ్యో! ఇఁ కేమున్నది! మోసము వాటి ల్లెను. సైంధవుండు కడతేరునట్లున్నది. వేగ మటఁ బోయి కృష్ణార్జునుల వధింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

[అంతఁ గృష్ణుఁడును, సైంధవునిశిరము నంబరమున నాడించుచు నర్జునుండును ప్రవేశింతురు]

అర్జు—కృష్ణా! ఈశిరము నెంతకాల మిట్లాడింపవలయును ?

కృష్ణు—అర్జునా! మున్నొకనాఁడు త్రికాలవేది యగు సైంధ వునితండ్రి, తనతనయున కేమఱుపాటున మృత్యువు సంభ వింపఁగల దని యెఱింగి "జయద్రథునిశిరం బెవ్వనిచేతుల నుండి భూతలంబునఁ బడునో వానిశీర్షంబు వేయిఖండంబు లగుఁగాక" యని శపించె. అందుమూలమున నిది యా రాజర్షి చేతులం బడునట్లు చేయుము. ఇప్పు డాతండు శ మంతకపంచకంబునఁ దపం బొనర్చుచు నుండె. అతండు కోసి భూతలంబునకుం ద్రోయఁగలఁడు. దానంజేసి తాఁ ద్రవ్వఁగొనినగోతియందుఁ దానే కూలును. పాశుపతా

స్త్రంబొండె యీకార్యంబుఁ జేయవలంతి. కావున నట్లొ
నర్పుము.

అర్జు—కృష్ణా! నీదయ గల నా కేదియు లోటు కల్గదు. నీయా
జ్ఞానుసారమే వర్తింతును. (పాశుపతమును దీసి) ఓయస్త్ర
రాజమా!

సీ. ధర్మాత్ముఁడై యొప్పు ధర్మరాజతిశాంతుఁ
డాడిబొంకనియట్టి యనఘుఁడేని
అన్నమాటలకు నేనణుగుదాఁటక, నార్య
సమ్మతుఁడ ననఁగఁ జనెదనేని
అకలంక మాభక్తి నాపరమేశ్వరు
భవునిఁ బూజించెడువాఁడనేని
అఖిలలోకాతీతమై యొప్పుచుండు నీ
వరయ పశుపతియస్త్రంబవేని

తే. గీ. అంబరపథంబునందు మదాశుగములఁ
దిరుగుచుండెడునట్టి యాశిరము నింక
ధరణిఁబడకుండ సింధుభూధవునితండ్రి
దోసిటం జేర్పఁగదవమ్మ! దోయిలింతు.

(బాణమును విడుచును.)

[తెరలో]

తే. గీ. తపనునకుఁ జేస్మి నర్ఘ్య ప్రదాన మొనరఁ
జేయుచుండ, వృద్ధుం డగు సింధునృపతి

హస్తమునఁబడె శిర మొకఁ డంత రోసి
ధరణిఁ బడఁద్రోసెఁ ద్రోయఁగాఁ దలయుఁ బగిలె.

కృష్ణు—(ఆలకించి) అర్జునా! కృతకృత్యుండ వైతివి. ఇంకేమి కావలయును. అయిన నిట్లగుఁగాక.

భరతవాక్యము.

ఉ. శాంతి వహించి యుండి జనసమ్మత మానటు గాగ భూమిపా, లింతురుగాక, భూవిభులు లేశము నీర్ష్యవహింపఁ బోక యే, చింతయుఁ జేకునుం గనక శ్రీ దులఁదూగి ప్రజ లుసుఖమ్ములం గాంతురుగాక ధర్మమును నాలుగు పాదములన్ జరించుతన్.

గద్య. ఇది శ్రీ తంగిరాల జగన్నాథశాస్త్రి విరచిత
మగు విజయప్రతిజ్ఞ యందుఁ
బంచమాంకమును
సర్వమును
సమాప్తము.



# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 14 | 2 | యాలాపమల్ | యాలాపముల్ |
| 14 | 15 | కయ్యాబు | కయ్యంబు |
| 16 | 8 | గురుపుత్రి | గురుపుత్త్రి |
| 24 | 2 | సమీపము | సమీకము |
| 25 | 12 | ముకే | చిక్కే |
| 26 | 11 | పుత్రినో | పుత్త్రినో |
| 35 | 1 | పతశు | పతిసి |
| 31 | 12 | లగణ్యమ్యు | లగణ్యమ్ము |
| 39 | 12 | తోజ | తోయజ |
| 43 | 12 | పుత్రి | పుత్త్రి |
| 45 | 15 | సాగ | సాంగ |
| 46 | 3 | నేంబాత్రిః | నేసాయం |
| 53 | 12 | దేహమ | దేహము |
| 54 | 8 | మ్మొర్చు | మ్మొనర్చు |
| 54 | 10 | మోఘణ | తమోఘణ |
| 55 | 1 | పర్మా | పద్మా |
| 58 | 8 | శ్రిత | సిత |
| 64 | 12 | హాసనము | హాసము |
| 95 | 14 | గావిపు | గావింపు |

# కాత్యాయనీగ్రంథమాల, తణుకు.



ఇందపూర్వములగు పురాణములు, కావ్యములు, నాటకములు మూఁడుమాసముల కొకటి ప్రకటింపఁబడును.

మాగ్రంథమాలకు విరాళముగా నొకేసారి ముందుగా రు 116 లొసఁగువారలు మహారాజపోషకు లనియు, రు 50 లిచ్చువారలు రాజపోషకు లనియు, రు 25 లిచ్చువారలు పోషకు లనియు, రు 12 లిచ్చువార లభిమానులనియుఁ బరిగణింపఁబడి వారినామములు ప్రతిగ్రంథమందును బ్రకటింపఁబడి తద్గ్రంథములు వారి కుచితముగ నొసఁగఁబడును.

రు 0-4-0 లు ప్రవేశరుసుము నిచ్చి చందాదారులుగఁ జేరువారలకు ప్రతిగ్రంథము వి. పి. పోష్టుద్వారా పంపెదము. ఈచందా సంవత్సరమునకు పోష్టేజిగాక రు 3 లకు మించి యుండదు. రు 3 లొకేసారి ముందుగా నిచ్చినవారికి పోష్టేజి మేముభరించెదము. కావునఁ బ్రతివారును మాగ్రంథమాలకు చందాదారులుగఁ జేరి మాయుద్యమమునకుఁ దోడ్పడుదురుగాక.

దివాకర్ల వేంకటావధాని,

తంగిరాల జగన్నాథశాస్త్రి,

సంపాదకులు.